# అపరోక్షానుభూతి

(శ్రీ మదాద్య శంకరాచార్య విరచితం)



నోరి శ్రీనాథ వేంకట సోమయాజులు

# గ్రంథకర్త పరిచయం

ప్రఖ్యాత రచయిత, విమర్శకులు, వక్త, ఉపాధ్యాయులు అగు శ్రీ నోరి శ్రీనాథ వేంకట సోమయాజులు గారు సంస్కృతాంధ్ర ఆంగ్ల, హిందీ భాషలలో పండితులు. స్వయంకృషితో తెలుగు. ఇంగ్లీషు, హిందీ భాషలలో అనేక పట్టములు సంపాదించారు. 1943-48 సంవత్సరాలలో గాంధీ గారి నిర్మాణ కార్యక్రమములో చురుకుగా పాల్గొని ఖద్దరు, హిందీ భాషా ప్రచారము చేశారు. తరువాత కృష్ణాజిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయులుగా చేరి 1977 లో ప్రధానోపాధ్యాయులుగా పదవీ విరమణ చేశారు. ఆ కాలములో వారు రచించిన గ్రంథాలలో శుభోదయములు, తుక్కాంబ, రఘునాధ విలాసము, 'పూర్వాంధ్ర కవులు' ఆంధ్ర, ఉస్మానియా, మద్రాసు, మైసూరు విశ్వవిద్యాలయాలలో పాఠ్య గ్రంథాలుగా నిర్ణయించబడ్డాయి. ఉద్యోగ విరమణ తరవుఆత వేద వాఙ్మయముపై అపారకృషి చేసి ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత, పాతంజల యోగ సూత్రముల వంటి విషయములపై సరళమైన తెలుగు భాషలో అనేక గ్రంథములు రచించిన సోమయాజులుగారు స్వతంత్ర భావనాశక్తి గల పండితులు. 13-12-1922 తేదీన కృష్ణాజిల్లా తోట్లపల్లూరు గ్రామంలో జన్మించిన వీరు 2-2-1997 న తాడిగడప గ్రామంలో వారి స్వగృహమున దివంగతులైనారు.

# ముందుమాట

శ్రీ శంకరులు రచించిన ప్రసిద్ధమైన ప్రకరణ గ్రంథాలలో అపరోక్షానుభూతి ఒకటి. ప్రత్యక్షంగా ఆత్మానుభూతికి సాధనాలను, వాటి స్వరూపాల్ని 144 శ్లోకాల్లో చెప్పారు. వినయప్రతిపాదనం చక్కటి దృష్టాంతాలతో చేయటంవల్ల సాహిత్య వాసనలుకూడా సంతరించుకొని రచన ఆద్యంతం హృద్యంగా సాగుతుంది. ఇందులో ప్రత్యక్ష ఆత్మానుభవం ప్రధాన విషయంగా ఉన్నా సందర్భాన్నిబట్టి వేదాంత సంబంధమైన విషయాలన్నీ వివరింపబడ్డాయి. జీవాత్మకు పరమాత్మకు ఉన్న అభేదాన్ని తెలుసుకోవాలంటే, ఈ రెంటికి మధ్య అడ్డుగా ఉన్న అవిద్యను తొలగించుకోవాలి. ఆవిధంగా అవిద్యను తొలగించుకొని తానే పరమాత్మననే అనుభూతిని పొందటానికి అవసరమైన సాధనాలను, సాధనలను విపులంగా ఇందులో చర్చించారు కాబట్టి జిజ్ఞాసువులకు, సాధకులకు మిక్కిలి ఉపయోగకారి.

ఇందులో రాజయోగానికి సంబంధించిన విషయంతోబాటు హఠయోగ విషయాలు కూడా ప్రస్తావించబడ్డాయి. కాని రాజయోగానికే ప్రాధాన్యత యిచ్చి, తద్వారా మాత్రమే సత్యానుభూతిని పొందగలుగుతారని నిరూపించారు.

వ్యాఖ్యానం సాధ్యమైనంతవరకు విపులంగా చేయబడ్డది. శ్రుతి ప్రమాణంకోసం అక్కడక్కడ ఉపనిషత్తులలోని విషయాలను ఉదహరించటం జరిగింది. నా అజ్ఞతవల్ల కలిగిన దోషాలేమైనా ఉంటే, వాటిని పరిహరించుకుంటే, పుస్తకం ఉపయోగపడుతుందని నా విశ్వాసం. ఈ ప్రకరణ గ్రంథాలు మన తెలుగుభాషలో చాలామంది వ్యాఖ్యానించి ముద్రించారు. అయినా విషయం యొక్క గొప్పదనాన్ని బట్టి, తెలుగువారి సంఖ్యనుబట్టి, భారతీయ వేదాంత శాస్త్ర ప్రచారావశ్యకతనుబట్టి, ఎన్ని గ్రంథాలు, ఎంతమంది రచించి ముద్రించినా ఇంకా తక్కువే అవుతాయి. అంతా ఆ పరమ గురువులకు విధేయులే కాబట్టి ఎక్కువ తక్కువలకు కూడా అవకాశం ఉండదని నా అభిప్రాయం. వ్యాఖ్యానంలో ఏమైనా దొసగులుంటే పరిహరించి మన్నించమని ప్రార్థిస్తూ...

వినీతుడు

**– వ్యాఖ్యాత**

# విషయసూచిక

# అపరోక్షానుభూతి

## మంగళాచరణం

### 1

***శ్రీహరిం పరమానన్ద ముపదేష్టార మీశ్వరమ్।***
***వ్యాపకం సర్వలోకానాం కారణం తం సమామ్యహమ్॥*** ***1***

పరమానంద స్వరూపుడు, పరమగురువు, ప్రభువు (ఈశ్వరుడు) అంతట వ్యాపించి ఉన్నవాడు, సమస్త లోకాలకు కారణమైనట్టి వాడు అయిన శ్రీహరికి నేను నమస్కరిస్తున్నాను.

ఈ విధమైన శ్రీహరివందనం చేసినది జీవాత్మ. ఆత్మస్వతః పరమాత్మయే కాబట్టి తనకు తాను వందనం చేసుకోనక్కరలేదు. స్థూల సూక్ష్మకారణ శరీరాలు కలిగినది జీవాత్మ. ఈ జీవాత్మ అజ్ఞాన బంధనాలతో బంధింపబడి ఉంటుంది వివిధములైన ప్రాపంచిన సుఖదుఃఖాలతో విసిగి వేసారి మోక్షాన్ని కాంక్షిస్తున్న జీవాత్మ చేసిన ప్రార్థన ఇది. సత్య జ్ఞానానంత స్వరూపం గల ఆత్మకు ఈ విధమైన ప్రార్థన చేయాల్సిన ఆగత్యం లేదు– అది నిత్యముక్తమే కాబట్టి! ఇక్కడ శ్రీహరి అంటే, సమస్త లోకాలకు కారణభూతమైనట్టి, పరమార్థ సత్తయైనట్టి పరమాత్మ అని భావం. ఎందుచేతనంటే, సాలెపురుగు బాహ్యపదార్థాలు వేటినీ అపేక్షించకుండా తనలోనుండి తమంత తాముగా ఉత్పన్నమైన దారాలతోనే గూడును నిర్మించినట్లుగా ఆ పరమాత్మయే ఈ సృష్టికంతకు ఉపాదానకారణము, నిమిత్తకారణము (మృత్తిక, కులాల, చక్ర, దండాదులలాగా) కూడా అయి ఉన్నాడని భావం.

# గ్రంథ ప్రయోజనం

***అపరోక్షాను భూతిర్వై ప్రోచ్యతే మోక్షసిద్ధయే ।***
***సద్భిరేవ ప్రయత్నేన వీక్షణీయా ముహుర్ముహుః॥*** **2**

ఈ శ్లోకంలో ఈ గ్రంథం యొక్క ప్రయోజనాన్ని చెపుతాన్నారు. అపరోక్షాను భూతి అనే ఈ గ్రంథం మోక్ష సిద్ధికోసం చెప్పబడుతోంది అటే, మోక్షమే ఈ గ్రంథ ప్రయోజనం అని. కాబట్టి సత్పురుషులైన వారు ఈ గ్రంథాన్ని, ఈ గ్రంథంలో చెప్పబడే విషయాల్ని మాటి మాటికి విచారణ చేయాల్సి ఉంది.

పరిశుద్ధమైన హృదయం కలవారు మాత్రమే ఈ గ్రంథంలో చెప్పబడే అపరోక్షాను భూతికి– ప్రత్యక్ష ఆత్మానుభవానికి అర్హులు. అటువంటి మోక్షాన్ని కోరే సత్పురుషులకోసం చెపుతున్నారు. అయితే, ఈ గ్రంథ ప్రయోజనమైన మోక్షసిద్ధి అనేది ఒకసారి చదివినందువల్ల కలగదు. నిత్యము, మాటి మాటికి ఇందులో చెప్పబోయే విషయాల్ని గురించి విచారణ చేయాలి.

ప్రతివారికి ఆత్మజ్ఞానం అనేది– తతను గురించిన జ్ఞానం అనేది ఏ కొద్దిగానైనా ఉంటుంది. ఎందుచేతనంటే, తాను లేనని ఎవడూ అనడు. అంటే, తనను తాను నిరాకరించుకోడు. అయితే, ఆత్మ అనేది ఉన్నదని తెలిసినా, దాని నిజస్వరూపం ఏమిటో తెలియదు. హృదయ నైర్మల్యం, తపస్సు, సాధన, వీటివల్ల క్రమంగా అజ్ఞానం దూరమై ఆత్మయొక్క నిజ స్వరూపం క్రమంగా వ్యక్తమౌతుంది– సమస్త వ్యవహారాల్లోను ఆత్మ అనేది ఒకటి సాక్షిగా ఉన్నట్లు అనుభూతి కలుగుతుంది. అయితే, 'నేనే ద్రష్టను' అనే భావం కలిగినా, ఇంకా ద్వైతభావం ఉన్నదన్నమాటే! ఎందుచేత ? ఇంకా ద్రష్ట (చూచేవాడు) దృశ్యము (చూడబడేది) వేరుగా ఉన్నాయి కాబట్టి ! ఈ ద్రష్ట దృశ్యము కూడా కరిగిపోయి, ఏకమైపోయి ఒకే ఆత్మగా కావాలి –భేదభావం పోవాలి. ఈ విధమైన అభేద జ్ఞానం కలగటాన్నే 'అపరోక్షానుభూతి' అంటారు. ఈ స్థితికి ఎట్లా చేరాలో ఈ పుస్తకంలో చెప్పబడుతోంది.

## సాధన చతుష్టయం

***స్వవర్ణాశ్రమధర్మేణ తపసా హరి తోషణాత్ ।***

***సాధనం ప్రభవేత్పుం సాం వైరాగ్యాది చతుష్టయమ్॥*** 3

పైన చెప్పిన అపరోక్షానుభూతిని పొందాలంటే, అందుకు అవసరమైన సాధన చతుష్టయాన్ని– నాల్గు సాధనాలను గూర్చి చెపుతున్నారు.

సంఘంలో తనవర్ణాశ్రమ ధర్మాల్ని తాను పాటిస్తూ తపస్సు ద్వారా శ్రీహరిని ప్రసన్నుని చేస్తూ ఉండటంవల్ల మానవులకు వైరాగ్యం మొదలుగా గల సాధన చతుష్టయం లభిస్తుంది.

వైరాగ్యము, వివేకము, శమదమాది షట్ సంపత్తి, ముముక్షుత్వం అనేవి నాలుగు సాధన చతుష్టయం. ఆత్మజ్ఞానాన్ని పొందటానికి ఈ నాలుగూ సాధనాలు. శమదమాది షట్కము అంటే– (1) శమము (2) దమము (3) ఉపరతి (4) తితిక్ష (5) శ్రద్ధ (6) సమాధానము. వీటిని గురించి తరువతి శ్లోకాల్లో వివరిస్తారు.

ఈ సాధన చతుష్టయం లభించాలంటే సాధకుడు ముందుగా ఆచరించాల్సిన విధులు రెండు చెప్పారు. అందులో మొదటిది– సంఘంలో తన వర్ణాశ్రమ ధర్మాలను తాను ఆచరించటం, రెండవది తపస్సు. ఈ రెంటి ద్వారా భగవంతుడు ప్రసన్నుడౌతాడు. వైరాగ్యాది సాధనాలకు అర్హునిగా చేస్తాడు.

***బ్రహ్మాది స్థావరాం తేషు వైరాగ్యం విషయేష్వను।***

***యథైవ కాకవిష్టాయాం వైరాగ్యం తద్ధి నిర్మలమ్ ॥*** 4

సాధన చతుష్టయంలో మొదటిదైన వైరాగ్యాన్ని వివరిస్తున్నారు. బ్రహ్మలోకం మొదలుకొని ఈ లోకం వరకు గల సమస్త లోకాల్లోని భోగవస్తువుల నన్నింటిని కాకిరెట్టతో సమానంగా చూడగలిగే ఆనాసక్తిని వైరాగ్యం లేక విరాగం అంటారు. అంటే బ్రహ్మ మొదలు స్తంభ పర్యంతం గల సమస్త వస్తువులు నాశనమైపోయే స్వభావం కలవని, శాశ్వతం కావని, ఆయా వస్తువులవల్ల కలిగే సుఖాలు కూడా అశాశ్వతమని భావించి, కాకిరెట్టను అసహ్యంతో విదలించివేసినట్లుగా ఆయా భోగాల యెడ విముఖత్వం కలగటమే వైరాగ్యం అని భావం.

విషయ భోగాలయెడల విరాగం అనేది రెండు విధాలు గా ఉంటుంది. ఒక విషయాన్ని అతిగా అనుభవించినందువల్ల ఆ పదార్థం ఎడల విముఖత్వం కలగవచ్చు– ఒకే పదార్థం తినగా తినగా విముఖత్వం కలిగినట్లు ! కాని అది నిజమైన వైరాగ్యంకాదు. ఎందుచేతనంటే, దానికంటె భిన్నమైనది, దానికంటె మంచిదైన దానిమీద కోరిక కలగవచ్చు. లేదా కొంతకాలం గడిచిన పిమ్మట మళ్ళీ ఆ వస్తువుమీద భోగకాంక్ష కలగవచ్చు. లేదా ఇహలోక భోగాలమీద విరక్తిపుట్టినా, స్వర్గలోక భోగాదులమీద కోరిక ఉండవచ్చు. అందుచేతనే 'బ్రహ్మాది స్థావరాంతం' గాగల సమస్త పదార్థాల యెడల విముఖత్వం ఉండాలని అన్నారు. కోరికల్ని సబీజంగా వదలివేయాలి అనేందుకు కూడా కాకిరెట్టను మనం ఉపమానంగా గ్రహించవచ్చు. బీజమనేది ఉంటే మళ్ళీ మొలకెత్తుతుంది. ఇహలోక పరలోక భోగవాంఛ లేవీ లేకుండా పోవటమే నిజమైన వైరాగ్యం.

***నిత్యమాత్మ స్వరూపం హి దృశ్యం తద్విపరీతగమ్ ।***
***ఏవం యో నిశ్చయః సమ్యగ్వివేకో వస్తునః స వై॥*** **5**

ఈ శ్లోకంలో సాధన చతుష్టయంలో రెండవదైన వివేకాన్ని గురించి చెపుతున్నారు.

ఆత్మయొక్క స్వరూపం ఒక్కటి మాత్రమే నిత్యమైనదని, ప్రపంచంలో మనకు కనిపించే ఈ సమస్తమూ అనిత్యమని, వస్తువుల యెడల ఈ విధమైన స్థిరమైనట్టి నిశ్చయబుద్ధి కలగటమే వివేకం. మనకు కనిపించే ప్రపంచమంతా దృశ్యము. ఈ వస్తుజాతమంతా నశించేదే కాబట్టి అనిత్యము. అనిత్యమైన ఈ సృష్టిలో నిత్యమైనది ఆత్మ ఒక్కటి మాత్రమే! ఈ విధమైనట్టి నిశ్చయజ్ఞానం కలగటాన్నే వివేకం అంటారు.

అద్వైత వేదాంతానికి మూలసూత్రమైన 'బ్రహ్మసత్యం. జగన్మిధ్యా జీవో బ్రహ్మైవనాపరః ' అనే దానిలో జనన్మిధ్యాత్వాన్ని. బ్రహ్మ ( ఆత్మ) యొక్క సత్యత్వాన్ని గుర్తించటమే వివేకం అనే అభిప్రాయాన్ని యిందులో చెప్పారు. ఇక్కడ దృశ్యము అంటే ఇంద్రియాలకు విషయాలైన వస్తుజాతం, ఇంద్రియాలు, మనస్సు బుద్ధి, ఇవన్నీను.

***సదైవ వాసనవా త్యాగః శమోఽ యమితి శబ్దితః ।***
***నిగ్రహో బాహ్యవృత్తీనాం దమ ఇత్యభి ధీయతే ॥*** **6**

ఈ శ్లోకం నుండి వరుసగా శమదమాది షట్సంపత్తిని (సాధన చతుష్టయంలో మూడవది) గూర్చి వివరిస్తున్నారు.

విషయవాసనలను పూర్తిగా వదలి వేయటాన్ని శమం అంటారు. అట్లాగే బాహ్యవృత్తులను నిగ్రహించటాన్ని దమం అంటారు.

పూర్వానుభవాలకు సంబంధించిన సంస్కారాలు వాటికి సంబంధించిన ముద్రలు మన మనస్సుపై పడి ఉంటాయి. ఆ సంస్కారాలే, ఆ వాసనలే ఆయా వస్తువుల్ని చూచినప్పుడు ఆయా సందర్భాల్లో మళ్ళీమేల్కొంటాయి. ఉదాహరణగా చెప్పుకోవాలంటే, లోగడ మనం మామిడి పండ్లుతిని ఉన్నాం. దాని రుచి, వాసన, వగైరాలు సంస్కార రూపంలో మన మనస్సులో ఉన్నాయి. మరుసంవత్సరం మళ్ళీ మనం మామిడిపండును చూచినప్పుడు ఆ సంస్కారం, పూర్వవాసన, కోరిక రూపంలో మేల్కొంటుంది. కాబట్టి ఆ వాసనా రూపమైన సంస్కారం కూడా మన మనస్సులో లేకుండా పూర్తిగా వదలివేయటాన్నే శమం అంటారు. బాహ్యమైన ఇంద్రియాలను అదుపులో ఉంచుకోవటాన్ని దమం అంటారు.

***విషయేభ్యః పరావృత్తిః పరమోపరతిర్హి సా।***
***సహనం సర్వదుఃఖానాం తితిక్షా సా శుభా మతా॥*** **7**

శమదమాది షట్కంలోని ఉపరతి, తితిక్ష అనేవాటిని వివరిస్తున్నారు. విషయ వాసనల యెడల పరాఙ్ముఖత్వం కలిగి ఉండటమే గొప్పదైనట్టి ఉపరతి. దుఃఖాల్ని, బాధల్ని సమభావంతో సహించగలగటాన్ని తితిక్ష అంటారు.

శమదమాదులలో విషయం చెప్పినప్పుడు విషయ వాసన, త్యాగం అనేది లక్షణంగా చెప్పటం వల్ల, ఈ ఉపరతికి కూడా అదే లక్షణం చెప్పటం వల్ల పునరుక్తి అవుతుందని అనుకోవచ్చు. తేడా ఏమిటి అంటే, శమదమాల విషయంలో విషయ వాసనలను అదుపులో పెట్టుకోవటానికి సాధకుని ప్రయత్నం ఉంటుంది. ఆ ప్రయత్నం ఫలించి విషయవాసనల యెడ పరాఙ్ముఖత్వం స్వభావంగా మారిపోతే ఆ స్థితిని ఉపరతి అంటారు. అంటే అప్రయత్నంగానే విషయవాసనల యెడ విముఖత్వం ఉంటుంది. అట్లాగే తితిక్ష అంటే దుఃఖాన్ని, బాధను సహించే శక్తి, బల విముఖత్వం ఉంటుంది. అట్లాగే తితిక్ష అంటే దుః ఖాన్ని, బాధను సహించే శక్తి, బలహీనుని సహనం తితిక్ష అనిపించుకోదు. బలవంతునికి

ఉండే కష్టాలను, దుఃఖాలను, అవమానాలను, అపకారాలను సహించే శక్తే తితిక్ష. అటువంటి తితిక్ష శుభంకరమైనది.

*నిగమాచార్యవాక్యేషు భక్తిః శ్రద్ధేతి విశ్రుతా ।*
*చిత్తైకాగ్ర్యంతు సల్లక్ష్యే సమాధాన మితి స్మృతమ్ ॥* **8**

శమదమాది షట్కంలో చివరి రెంటినీ– శ్రద్ధ, సమాధానం అనే వాటిని వివరిస్తున్నారు.

వేదాశాస్త్రాల యెడల, గురువుయెడల ఉండే భక్తినే శ్రద్ధ అంటారు. తన వాస్తవికమైన లక్ష్యంమీద చిత్రాన్ని ఏకాగ్రంగా ఉంచుకోవటమే సమాధానం లేక సమాధి అంటారు.

*సంసార బంధ నిర్ముక్తిః కథంమే స్యాత్కదా విభో ।*
*ఇతి యా సుదృఢా బుద్ధి ర్వక్తవ్యాసా ముముక్షుతా ॥* **9**

"ఓ ఈశ్వరుడా ! నాకు ఈ సంసార బంధనాలనుండి ఎప్పుడు, ఏ విధంగా విముక్తి లభిస్తుంది?" అనే ఈ విధమైన నిరంతరం జ్వలిస్తూ ఉండే బలమైన కోరికనే ముముక్షుత్వం అంటారు. అంటే మోక్ష కాంక్ష. ఈ ముముక్షుత్వం ఉన్నవాడే బ్రహ్మజ్ఞానానుభూతికి అర్హుడు. ఈ ముముక్షుత్వం అనేది సాధన చతుష్టయంలో చివరిది.

# విచారణ పద్ధతి

*ఉక్తసాధన యుక్తేన విచారః పురుషేణ హి ।*

*కర్తవ్యో జ్ఞాన సిద్ధ్యర్థమాత్మనః శుభమిచ్ఛతా ॥* **10**

జ్ఞాన ప్రాప్తికి అవసరమైనట్టి సాధన చతుష్టయంతో కూడినవాడే, సాంసారిక బంధనాలనుండి ముక్తిపొందాలనే తన మంచిని కోరినవాడై జ్ఞానప్రాప్తికోసం నిరంతం విచారణ చేయాలి.

ముక్తిపొందాలని కోరేవాడు ముందుగా సాధనద్వారా తన మనస్సును అదుపులో ఉంచుకోవాలి– శమదమాదులను సాధించాలి. అందు కోసం, నిరంతరం, ఈ ప్రాపంచిక సుఖాలయొక్క అస్థిరత్వాన్ని, నిస్సారతను, గూర్చి ఆలోచిస్తూ ఉండాలి– విచారణ చేస్తూ ఉండాలి. నిత్యము సత్యము అయిన ఆత్మను గూర్చి ఆలోచిస్తూ ఉండాలి. అంటే ఆత్మ అనాత్మలను గూర్చి, ప్రపంచము– పరమాత్మలను గూర్చి విచారణచేస్తూ ఉండాలి.

*నోత్పద్యతే వినా జ్ఞానం విచారేణాన్య సాధనైః ।*

*యథా పదార్థభానంహి ప్రకాశేన వినా క్వచిత్ ॥* **11**

ఒక వస్తువు మనకు గోచరించాలీ అంటే ప్రకాశం (వెలుతురు) ఉండాలి. కటిక చీకటిలో మనం ఏ వస్తువునూ చూడలేము. అట్లాగే నిరంతర విచారణవల్ల తప్ప ఇతరమైన ఏ సాధనాల వల్లను జ్ఞాన మనేది కలగదు. అంటే యజ్ఞయాగాది కర్మలవల్ల గాని, ఉపాసన లేక భక్తివల్లగాని జ్ఞానప్రాప్తి కలగదు అని భావం.

చీకటి వస్తువును దాచి ఉంచినట్లు. ఆజ్ఞానం (మాయ) అనేది జ్ఞానాన్ని కప్పి ఉంచుతుంది. ఈ విద్యను (మాయను) తొలగించు కోవాలంటే యథార్థ తత్త్వాన్ని గురించి మనం ప్రతిక్షణము ఆలోచన (విచారణ) చేస్తూ ఉండాలి. అట్లా చేయటంవల్ల క్రమంగా ఆవిద్య తొలగిపోతుంది– జ్ఞాన ప్రకాశంతో !

*కోఽ హం కథమిదం జాతం కోవై కర్తాస్య విద్యతే ।*

*ఉపాదానం కీమ స్తీహ విచారః సో యమీదృశః॥* **12**

ఆ విచారణ అనేది ఎట్లా సాగాలో చెపుతున్నారు.

నేను ఎవరిని? ఈ జగత్తు ఏవిధంగా పుట్టింది? ఈ జగత్తుకు కర్త ఎవరు? ఈ జగత్తుకు ఉపాదాన కారణం ఏది? ఆత్మ విచారణ అనేది ఈ విధంగా ఉంటుంది.

ప్రపంచంలో మానవుడైన ప్రతివాడికీ, ఆలోచన అనేది ఉంటే– ఎప్పుడో ఒకప్పుడు ఈ విధమైన ప్రశ్నలు ఉదయిస్తాయి– పశుప్రాయుడైతే తప్ప. ఆ ప్రశ్నలు ఉదయిస్తాయి– పశుప్రాయుడైతే తప్ప. ఆ ప్రశ్నలు– నేను ఎవరిని? ఈ ప్రపంచ స్వరూపమంతా ఏమిటి? ఈ సృష్టి అంతా ఎట్లాపుట్టింది? దీనిని సృష్టించినవాడెవడు? దేనితో ఈ జగత్తు సృష్టింపబడుతోంది? దీనికి గమ్యం ఏది? మొదలైనవి. అయితే, ఈ ప్రశ్నలకు సమాధానం మాత్రం తేలికగా లభించదు. తానంటూ ఒకడు ఉన్నట్లు ప్రతివాడికీ తెలుసు. కాని తానెవరో తెలియదు. మేలుకొని ఉన్నప్పుడు (జాగ్రదవస్థలో) తానంటే ఫలానా పేరు గల ఈ శరీరమని, బాల్యయౌవన వార్ధక్యాలను, బలాన్ని, బలహీనతను, అనుభవించే ఈ శరీరమే తానని అనుకుంటాడు. స్వప్నం చూచేటప్పుడు బాహ్య శరీరంలతో సంబంధం లేకుండా, స్వప్నంలో వివిధ సుఖ దుఃఖాల్ని, వివిధములైన అనుభూతుల్ని చవిచూచే సూక్ష్మశరీరం అనుకుంటాడు. గాఢనిద్రలో మనమంటూ ఒకళ్ళం ఉన్నామా? లేదా? అనే స్పృహ కూడా లేని స్థితిలో ఉంటాం. 'ఈ అన్ని స్థితులకు అతీతమైనవాడిని నేను' అనే విషయం, ఆ 'నేను' ఎవరు? ఎటువంటివాడు? అనే విషయం తెలియని సమస్యగానే మిగిలిపోతుంది. ఇట్లా జన్మలు గడిచిపోతూనే ఉంటాయి. కాబట్టి 'నేను ఎవరిని' అనే విషయాన్ని గూర్చిన నిరంతర విచారణ అవసరం.

చాలమంది 'నేను ఆత్మనని, ఆ అవస్థ లన్నింటికి అతీతుడ' నని, పుస్తకాలు చదిని, గురువులవల్ల విని తెలుసుకొని ఉంటారు. కాని, వారికి సైతం స్వస్వరూప జ్ఞానం కలగకపోవటానికి కారణం సమ్యగ్విచారణ లేకపోవటమే ! చిలకపలుకులవల్ల ఆత్మసాక్షాత్కారం కాదు.

***నాహం భూతగణో దేహోనాహం చాక్షగణస్తథా ।***
***ఏత ద్వి లక్షణః కశ్చి ద్వి చారః సోఽ యమీదృశః ॥ 13***

"నేను పంచభూతాలచేత నిర్మింపబడిన శరీరాన్ని కాను." "ఎందుచేత కాను?" "నేను కేవలం శరీరాన్నే అయితే జడాన్ని అయి ఉండాలి కాబట్టి?" "మరి ఎవరివి?

ఇంద్రియ సమూమానివా?" "కాదు." "ఎందుచేత?" "ఇంద్రియాలు, వాటి విషయాలూ కూడా శాశ్వతాలు కావు." "మరి ఎవరివి?" "ఈ శరీరాలు ఇంద్రియ సమూహం కూడా కాకుండా ఉన్నట్టి, వీటి అన్నింటికి భిన్నమైనట్టిదేదో ఒకటి అయి ఉంటాను." విచారణ అనేది ఈ విధంగా సాగాలి.

***ఆజ్ఞాన ప్రభవం సర్వం జ్ఞానేవ ప్రవితీయ తే।***
***సంకల్పో వివిధః కర్తా విచారః సోఽ యమీదృశః॥*** **14**

"ఈ సమస్త జగత్తు ఆజ్ఞానం నుండి పుట్టింది- అంటే, అవిద్యాజన్యం అన్నమాట. జ్ఞానం కలగటంతోనే ఆ విద్య మాయమైపోతుంది. అంటే, జ్ఞాం కలగటంతోనే ఆవిద్య నుండి పుట్టిన జగత్తు కూడా లయమైపోతుంది. కాబట్టి ఈ జగత్తుకు కారణం సంకల్పాలు. అంతఃకరణ వికృతులైనట్టి అనేక విధాలుగా ఉండే సంకల్పాలే జగత్తుకు కర్త అయి ఉండాలి. అంతఃకరణ వికృతులు అంటే మాయ అన్నమాటే!" అని ఈ విధమైన విచారణ సాగాలి.

లోగడ ఈ జగత్తుకు కారణమేమిటి? అనే ప్రశ్న వేసుకొనిన జిజ్ఞాసువు సమాధానాన్ని ఎట్లా, ఆలోచించాలో ఇక్కడ సూచించారు. అజ్ఞానం లేక అవిద్య అనేది జగత్కారణమని చెప్పారు. దానిని రుజువు చేయటానికిగాను రజ్జు- సర్పభ్రాంతిని చెవుతున్నారు. మసక చీకటిలో త్రాటిని చూచి పామ అని భ్రమించి భయపడుతున్నాము. పిమ్మట మెల్లగా ఆలోచిస్తున్నాము. ఏమని? ఇది పామేనా? పాము అయితే కదలాలి గదా! కదలలేమి? పాము అయితే తలవైపు లావుగా ఉండాలి గదా ! తోక సన్నగా ఉండాలి గదా! అట్లా లేదేం? అంతా ఒకేవిధంగా ఉన్నదేమిటి? మనలాగానే అది కూడా భయపడి పారిపోనాలి గదా! పారిపోదేమి? ఇట్లా ఆలోచించగా ఇది పాము కాదు, త్రాడు అయి ఉంటుంది అని తెలుస్తుంది. -దాని నిజరూపం తెలిసింది అనన్నమాట. అట్లాగే మన కండ్ల ముందున్న ఈ జగత్తు అంతా మాయవల్ల, ఆజ్ఞానంవల్ల ఇట్లా నామరూపాలతో కనిపిస్తోంది అని విచారణ జరిపినవానికి ఆవిద్యతొలగిపోవటంవల్ల నిజరూపం తెలుస్తుంది.

మనం చూస్తున్న ఈ ప్రపంచం, దాని వెనుక నున్న మన ఆలోచనలు, అనుభూతులు ఇవన్నీ మన అంతఃకరణ ప్రవృత్తులు- చిత్తవృత్తులు. ఇవే మనకు ప్రపంచం ఈ రూపంలో కనిపించటానికి కారణమవుతున్నాయి. మనం స్వప్నావస్థలో అనుభవించే అనుభవాల్ని

గురించి బాగా విమర్శిస్తే మనలోని ఈ చిత్తవృత్తులు, అనుభూతులే ఈ ప్రపంచం ఈ విధంగా కనిపించటానికి  కారణమని తెలుస్తుంది. అసలు ఈ భౌతిక ప్రపంచం అంటూ ఏదీ లేదని,  మన అనుభూతులే దానిని సృష్టిస్తున్నాయని (మన సంస్కారాలు, వాసనలు స్వప్నాన్ని సృష్టించినట్లు తెలుస్తుంది. స్వప్న ప్రపంచం  లాగానే ఈ జాగ్రదవస్థలోని ప్రపంచం కూడా. స్వప్న జగత్తును చూసేటప్పుడు ఈ జగత్తు.  ఈ జగత్తును చూసేటప్పుడు ఈ జగత్తు, ఈ జగత్తును చూసేటప్పుడు స్వప్న జగత్తు మాయమైపోతాయి. కాబట్టి రెండూ సత్యం కావు.

***ఏతయోర్యదుపాదాన మేకం సూక్ష్మం సదవ్యయమ్।***
***యథైవ మృద్ఘటాదీనాం విచారః సోఽ యమీదృశః॥*** **15**

"ఘటం (కుండ) మొదలైనవాటికి ఉపాదాన కారణం మృత్తిక (మట్టి) లాగానే ఈ అజ్ఞానం, సంకల్పం అనే రెంటికీ ఉపాదన కారణం ఒక సూక్ష్మమైనట్టి, ఇంద్రియ గోచరం కానట్టి, అవికారియైనట్టి, శాశ్వతమైనట్టి ఒక సత్త (సత్యం, ఆస్థిత్వం) ఉంది. ఆ సత్త (ఆస్థిత్వం) అనేది అద్వితీయం (రెండవదంటూ లేనిది) అఖండము; పూర్ణము." ఈ విచారణ అనేది  ఈ విధంగా సాగాలి.

***అహమేకో పి సూక్ష్మశ్చ జ్ఞాతా సాక్షీ సదవ్యయః।***
***తదహం నాత్ర సందేహో విచారః సోఽ యమీదృశః॥*** **16**

"నేను కూడా ఆ విధమైన సూక్ష్మాన్నే !- ఇంద్రియాలకు అతీతమైనవాడనే ! నేను కూడా జ్ఞాతనే ! సాక్షినే ! నేను కూడా కారణసత్తనే ! శాశ్వతుణ్ణే ! నాశనం లేనివాడనే ! నేను కూడా ఆ కారణ్నే ! కాబట్టి, నేను కూడా ఆ  కారణసత్తయైన పరమాత్మనే ! ఇందులో సందేహం లేదు." అంటూ విచారణ ఈ విధంగా ఉండాలి.

'జ్ఞాత' అంటే మన సమస్తమైన అనుభవాల్లోను చైతన్య రూపంలో ఉంటూ, తనను తాను కూడా గమనిస్తూ ఉండే పరమాత్మ. ఉదాహరణంగా చెప్పాలంటే –'నేను ఉన్నానని నేను ఎరుగుదును' అనే వాక్యంలో 'నేను ఎరుగుదును'లో 'నేను' కర్త. 'ఎరుగుదును' క్రియ. 'నేను ఉన్నానని' అనేది కర్మ. కర్మలో ఉన్న 'నేను' కుర్తలో ఉన్న 'నేను' జ్ఞాత. అంటే కర్త, కర్మ కూడా ఒకటే ! (నేను అనే కర్మలోని  జీవభావాన్ని తీసేస్తే కర్తకు కర్మకు కూడా భేదం లేదు. అట్లాగే  పరమాత్మకు ఆత్మకు భేదం లేదు).

# ఆత్మానాత్మ వివేకం

*ఆత్మా వినిష్కలో హ్యేకో దేహో బహుభిరావృతః*
*తయోరైక్యం ప్రపశ్యన్తి కిమజ్ఞాన మతః పరమ్॥* **17**

ఆత్మ అనేది నిష్కలమైనది- ఆఖండమైనది. అద్వితీయము రెండవదంటూ లేనిది. కాని ఈ దేహమనేది మాత్రం అనేక రకాల తత్త్వాలతో, అనేక భాగాలో నిర్మింపబడ్డది (ఆత్మ లాగా నిష్కలము, అద్వితీయము కాదు) ఆత్మకు దేహానికి ఉన్న భేదం ఇదీ ! ఇటువంటి ఆత్మను దేహాన్ని ఒకటిగానే భావిస్తున్నాము. ఇంతకు మించిన అజ్ఞానం ఇంకేమి ఉంటుంది?

త్రాటిని చూచి పాము అనుకోవటం ముత్యపు చిప్పను చూచి వెండిగా అనుకోవటం ఆజ్ఞానం.. అట్లాగే దేహంలో ఆత్మభావం కూడా (దేహాన్ని ఆత్మగా భావించటం) ఆజ్ఞానమే! అట్లాగే కర్మగా ఉన్న శరీరాన్ని (నేనును) కర్తగా (ఆత్మగా) భావించటం కూడా అటువంటి భ్రాంతే ! ఆజ్ఞానమే !

*ఆత్మానియామకశ్చాన్తర్దేహో బాహ్య నియమ్యకః ।*
*తయోరైక్యం ప్రపశ్యన్తి కిమజ్ఞానమతః పరమ్ ॥* **18**

ఆత్మ అనేది అంతర్వర్తియై (లోపల ఉంటూ) నియామకుడుగా (నియమించేదిగా) ఉంటుంది. దేహమనేది బాహ్యవర్తియై (బయట ఉంటూ) నియమింపబడుతూ ఉంటుంది. ఈ విధంగా భిన్నంగా ఉండే ఆత్మ, దేహమూ అనే రెండూ ఒకటే అని, రెంటికి భేదం లేదని అనుకోవటం కంటె అజ్ఞానం ఇంకేముంటుంది?

నియమించేవాడు, నియమింపబడేవాడు ఒకడు కాదు. ఆత్మలోపల ఉంటూ శరీరాన్ని నియమిస్తుంది. కాబట్టి ఆత్మకు శరీరానికి సేవ్య సేవక భావమే తప్ప రెండూ ఒకటి కావు. 'దృశ్యం సర్వ మనాత్మా' కనిపించేదంతా ఆనాత్మ అన్నారు. కాబట్టి శరీరం ఆత్మ కాదు.

*ఆత్మా జ్ఞానమయః పుణ్యో దేహో మాంసమయోఽ శుచిః ।*
*తయోరైక్యం ప్రపశ్యన్తి కిమజ్ఞానమతః పరమ్ ॥* **19**

ఆత్మ అనేది జ్ఞానస్వరూపం కలది. పవిత్రమైనది. దేహమనేది మాంసమయమైనది. అపవిత్రము– ఆశుచియైనది. అటువంటి అపవిత్రమైన శరీరాన్ని పవిత్రమైన ఆత్మగా భావించటంకంటె అజ్ఞానం ఏముంటుంది?

*ఆత్మాప్రకాశకః స్వచ్ఛో దేహస్తామస ఉచ్యతే।*

*తయారైక్యం ప్రపశ్యన్తి కిమజ్ఞానమంతః పరమ్ ॥* **20**

ఆత్మ అనేది ప్రకాశింపచేసేది. స్వచ్ఛమైనట్టిది. దేహమనేది తమోమయమైనది. ఈ రెంటిని ఒకటిగానే అనుకుంటున్నారు. ఇంతకంటె అజ్ఞానం ఏముంటుంది? ఆత్మ అనేది సూర్యునిలాగా ప్రకాశస్వరూపం కలిగి సమస్తాన్ని ప్రకాశిం పచేస్తుంది. శరీరమనేది జడం కాబట్టి తమోమయమైనది. కేవలం శరీరం జడమేగదా ! అజ్ఞానులు మాత్రమే ఈ రెంటిని ఒకటిగా భావిస్తారు.

*ఆత్మానిత్యో హి సద్రూపో దేహోఽ నిత్యో హ్యసన్మయః।*

*తయారైక్యం ప్రపశ్యన్తి కిమజ్ఞానమతః పరమ్ ॥* **21**

ఆత్మ అనేది నిత్యమైంది. సత్స్వరూపం కలది. ఇక దేహం అనేది అసత్ స్వరూపం కలది; అనిత్యమైనది. ఈ రెంటిని ఒకటే అని భావిస్తారు. ఇంతకంటె అజ్ఞానం ఏముంటుంది?

ఈ శరీరం అనుక్షణం మార్పు చెందుతోంది. బాల్య యౌవన వార్థక్యాది అవస్థల వల్ల, రోగాలు, దుఃఖాలు మొదలైన వాటికిలోనై మృత్యువుకు లొంగిపోతుంది కాబట్టి అనిత్యం. అయితే కండ్ల ముందు కనిపిస్తున్న ఈ శరీరాన్ని ఎట్లా కాదనగలం? వ్యక్తి రూపంలో శరీరంలాగానే సమిష్టి రూపంలో జగత్తు కూడా అనిత్యమే గదా ! మరి కనపిస్తున్న ప్రపంచాన్ని ఎట్లా లేదని అనగలం? అందుకే ఈ జగత్తుకు, శరీరానికి ఉన్న అస్థిత్వాన్ని వ్యావహారికసత్త అన్నారు– అంటే ఉన్నంతవరకు మాత్రమే సత్యం. క్రమేణా మార్పుకులోనై, నాశనానికిలోనై అనిత్యమని తేలిపోతుంది.

*ఆత్మన స్తత్ప్రకాశత్వం యత్పదార్థావభాసనమ్।*

*నాగ్న్యాది దీప్తివద్దీ ప్తిర్భవత్యాన్ధ్యం యతోనిశి ॥* **22**

పదార్థాల్లో మనకు కలిగే ప్రతీతి అనేది ఆ పదార్థాల్లో ఉన్నట్టి ఆత్మ యొక్క ప్రకాశమే! అంటే ఈ సమస్త వస్తుజాతంలోను ఆత్మ జ్యోతి ప్రకాశిస్తూ ఉంటుంది. అయితే ఆత్మకున్నట్టి ఈ ప్రకాశకత్వమనే గుణం అగ్నికిగాని లేక సూర్యుడు లేక అటువంటి ఇతర పదార్థాలకున్నట్టి ప్రకాశగుణం వంటిది కాదు. ఎందుచేతనంటే అగ్ని, దీపం, సూర్యుడు ఇవి లేకపోతే, రాత్రిపూట చీకటి వ్యాపిస్తుంది. అంటే వాటికి ఏకదేశత్వం ఒకచోట ఉండటం, ఒకచోట లేకపోవటం అనేది ఉంటుంది. ఆత్మజ్యోతి లేకపోవటమనేది ఉండదు. అది స్వరత్ర, నిత్యము ఉండేది. అంటే ప్రతి శరీరంలోను ఎల్లప్పుడు ఉంటుంది. అటువంటి ఆత్మను, కేవలం జడము, అనిత్యం అయిన శరీరంగా భావించటం అజ్ఞానం.

***దేహోఽహ మిత్యయం మూఢో ధృత్వా తిష్ఠత్యహో జనః***

***మమాయమిత్యపి జ్ఞాత్వా ఘటద్రష్టేవ సర్వదా ॥*** **23**

'ఈ శరీరం నాది' అని అనుకుంటూ కూడా మూఢులైనవారు మళ్ళీ శరీరాన్ని ఆత్మను ఒకటిగా భావిస్తూ ఉంటారు. 'ఈ శరీరం నాది' అని అనుకోవటంలోనే 'శరీరం' వేరు 'నేను' వేరు అనే భావం స్పష్టంగా కనపిస్తున్నా కేవలం పదార్థవాదుల్లాగా దేహాన్నే ఆత్మగా భావించటం అజ్ఞానం గదా ! కుండను చూచి 'ఈ కుండ నాది' అని అనుకోవటంలోనే కుండ వేరు, నేను అనేవాడు వేరు అని బోధపడుతోంది గదా ! ఇక శరీరాన్నే ఆత్మ అని ఎట్లా అనగలం?

# జ్ఞాన స్వరూపం

***బ్రహ్మైవాహం సమః శాంతః సచ్చిదానంద లక్షణః ।***
***నాహం దేహో హ్యసద్రూపో జ్ఞాన మిత్యుచ్యతే బుధైః ॥*** **24**

"నేను పరబ్రహ్మను. సముడను. శాంతస్వభావం కలవాడను. సచ్చిదానంద స్వరూపుడను. నేను అసత్ స్వరూపం గల దేహాన్ని కాను" అనే ఈ విధమైన జ్ఞానాన్నే వివేకవంతులు నిజమైన జ్ఞానం అంటారు.

ఆత్మకు, పరమాత్మకు ఏ విధమైన భేదమూ లేదని గ్రహించటం జ్ఞానం. అంటే, వెనుక చెప్పిన విధంగా విచారణ చేయగా చేయగా తానే బ్రహ్మనని, తాను తప్ప బ్రహ్మమనేది వేరేలేదని అనుభూతి కలుగుతుంది. ఈ విశ్వమంతా బ్రహ్మస్వరూపమే! ఆ బ్రహ్మను నేనే ! నేను దేహాన్ని మాత్రమే కాను– అంటే, స్థూల సూక్ష్మకారణ శరీరాలన్నీ అసత్యాలే ! ఈ మూడు రకాల శరీరాలు కూడా ఆత్మ కావు అనే అనుభూతినే జ్ఞానమంటారు.

***నిర్వికారో నిరాకారో నిరవద్యోఽ హ మవ్యయః ।***
***నా హం దేహో హ్యసద్రూపో జ్ఞానమిత్యుచ్యతే బుధైః ॥*** **25**

నేను నిర్వకారుణ్ణి– దేశకాలాదులవల్ల నాలో ఏ విధమైన మార్పు ఉండదు. నేను నిరాకారుడను– నాకు ఏ విధమైన రూపము లేదు. నేను ఏ విధమైన వికల్పము లేనివాడను. సంపూర్ణుడను. అంతట వ్యాపించి ఉన్నవాడను. నేను అసత్యమైన శరీరాన్నికాను– మూడు శరీరాలకు అతీతుణ్ణి. అని తెలుసుకోవటాన్నే బుధులు 'జ్ఞానం' అని అంటారు.

***నిరామయో నిరాభాసో నిర్వికల్పోఽ హ మాతతః***
***నా హం దేహో హ్యసద్రూపో జ్ఞాన మిత్యుచ్యతే బుధైః ॥*** **26**

"నేను ఏ విధమైన వ్యాధులు, దుఃఖాలు లేనివాడను. నేను ఆగోచరుడను. మార్పులు లేనివాడను (వికల్పములు లేనివాడిని) నేను ఆసత్యము, ఆశాశ్వతము అయిన శరీరాన్ని కాను" అనే ఈ విధమైన సత్యాన్ని తెలుసుకోవటమే జ్ఞానం అని పండితులు అంటారు.

***నిర్గుణో నిష్క్రియో నిత్యో నిత్యముక్తోఽ హ మచ్యుతః***
***నా హం దేహో హ్యసద్రూపో జ్ఞాన మిత్యుచ్యతే బుధైః ॥*** **27**

"నేను నిర్గుణుడను– నామరూపాదులు లేనివాడను. నిష్క్రియుడను– నేను చేయవలసిన పనులంటూ ఏమీ లేవు. అంటే ఏ విధమైన కర్తవ్యము నాకు లేదు. నేను సదా సర్వస్వతంత్రుడను– ముక్తుడను. నేను ఆచ్యుతుడను– నాశనం లేనివాడను. నేను ఈ ఆసత్య స్వరూపమైన దేహాన్ని కాను." అని తెలుసుకోవటాన్నే బుధులు జ్ఞానమంటారు.

***నిర్మలో నిశ్చలోఽ నంతః శుద్ధోఽ హమజరోఽ మరః ।***
***నాహం దేమో హ్యసద్రూపో జ్ఞాన మిత్యుచ్య తే బుధైః ॥*** **28**

"నేను నిర్మలమైనవాడను– పరిశుద్ధుడను– పాపరహి తుడను. నేను నిశ్చలుడను– స్థిరమైనవాడను. అనంతుడను– అంతులేనివాడను. నేను పవిత్రుడను, నాశనం లేనివాడను– శాశ్వతుడను. అసత్ స్వరూపమైన దేహాన్ని కాను." అనే ఈ విధమైన తెలివిడినే జ్ఞానమంటారు.

## జ్ఞానోపదేశం

*స్వదేహే శోభనం సన్తం పురుషాఖ్యం చ సంమతమ్ ।*

*కిం మూర్ఖ శూన్యమాత్మానం దేహాతీతం కరోషి భోః ॥* **29**

వెనుకటి శ్లోకాల్లో ఆత్మను గురించి, అనాత్మను గురించి చెప్పారు. మానవుని బుద్ధికి తోచినంత మేర దృశ్యమైనదంతా అనాత్మ అని చెప్పారు. ఆత్మకు ఉండే విశేషణాలు, లక్షణాలు చెప్పారు. 'ఈ లక్షణాలు ఉన్న ఆత్మ అనేది ఒకటి ఉన్నదా?' అనే అనుమానం రావచ్చు. 'ఆత్మ అనేది ఉన్నదని ప్రతివాడికి అనుభవంలో తెలిసే విషయమే ! తాను లేనట్లు ఎవడూ అనుకోడు గదా! తాను ఉన్నానని అనుకోవడమంటే ఆత్మ ఉన్నదని అనుకోవటమే ! కాబట్టి ఆత్మను శూన్యమనిగాని, అసత్యమని, అస్తని అనటంలో అర్థం లేదు.' అని ఆత్మజ్ఞానాన్ని ఈ దిగువ శ్లోకాల్లో బోధిస్తున్నారు– శూన్యవాదాన్ని నిరాకరిస్తున్నారు.

ఓ మూర్ఖుడా! నీ శరీరంలో పురుషుడనే పేరుతో పిలవబడుతూ, సుందరమైనట్టి దేహానికి అతీతమైనట్టి, శాస్త్రాదులన్నింటిచేత అంగీకరింపబడినట్టి ఆత్మ ఉన్నా కూడా నీవు ఏమీ లేదనీ, శూన్యమనీ ఎందుకంటావు? నీ వు వేదశాస్త్రాలలో చెప్పబడిన విషయాలను ఆధారంగా చేసుకుని, నీ విచక్షణ జ్ఞానాన్ని కూడా ఉపయోగించి నీలో ఉన్న ఆత్మను తెలుసుకో! ఆ ఆత్మకే పురుషుడని పేరు. అతడే బ్రహ్మ. అటువంటివానిని నీవు అసత్తని ఎందుకు అనుకుంటున్నావు?

*స్వాత్మానం శృణుమూర్ఖ త్వం శ్రుత్యా యుక్త్యా చ పూరుషమ్।*

*దేహాతీతం సదాకారం సుదుర్దర్శం భవాదృశైః ॥* **30**

ఈ శ్లోకం మొదలుకొని 40వ శ్లోకం వరకు ఆత్మకు అనాత్మకు (శరీరానికి) గల భేదాన్ని వివరిస్తున్నారు.

ఓ మూర్ఖుడా ! ఆత్మ అనేది నీలాంటివారికి, భౌతిక దృష్టికి కనపడాలంటే కష్టం– అసంభవం. దేహానికి అతీతమైనట్టి, సత్ స్వరూపమైనట్టి, ఆత్మను తెలుసుకోవాలంటే– ఆ

ఆత్మపురుషుని తెలుసుకోవాలంటే వేదాలలో, ఉపనిషత్తులలో చెప్పిన దానిని విను. యుక్తి పూర్వకంగా ఆలోచించి తెలుసుకో!

ఈ శరీరం కంటె ఆత్మ అనేది సూక్ష్మమైనదని, ఆత్మ అంటే ఈ రక్త మాంసాదులతో కూడిన శరీరంకాదని (తైత్తిరీయోపనిషత్తు ఆనందవల్లి 2వ అనువాకం) ఈ శరీరం కంటె ఆత్మ అనేది విలక్షణమైనదని, భిన్నమైనదని శ్రుతులు చెపుతున్నాయి. సామాన్యంగా ఈ శరీరాన్ని, లేదా మనస్సును, బుద్ధిని ఆత్మ అని భ్రమిస్తూ ఉంటారు అని భావం. నీ వంటి అజ్ఞానులని, మూర్ఖులని అనటంలో ఉద్దేశ్యం, శరీరాసక్తి కలిగి శరీరం మాత్రమే ఆత్మ అని అనుకొని, ఈ రెంటికి ఉన్న భేదాన్ని గమనించలేని వారు అని భావం.

***అహం శబ్దేన విఖ్యాత ఏక ఏక స్థితః పరః ।***
***స్థూల స్త్వనేకతాం ప్రాప్తః కథం స్యాద్దేహకః పుమాన్॥*** **31**

పరమాత్మ 'నేను (అహం)' అనే శబ్దంతో ఒక్కడుగానే ప్రసిద్ధుడై ఉన్నాడు. 'నేను' అనే శబ్దం పరమాత్మను సూచించేదే! అంటే, పరబ్రహ్మ అనేక తత్త్వాల కలయిక కాదు– ఈ శరీరంలాగా ! అని భావం. ఇక ఈ శరీరమనేదో ! అనేక తత్త్వాల కలయిక. స్థూలంగా ఉంటూ, అనేక భావాలతో, రూపాలతో, అనేకంగా ఉండే, శరీరం ఆత్మ (పురుషుడు) ఎట్లా అవుతుంది?

***అహం ద్రష్టృతయా సిద్ధో దేహో దృశ్యతయా స్థితః ।***
***మమాయమితి నిర్దేశాత్కథం స్యాద్దేహకః పుమాన్ ॥*** **32**

అహం– 'నేను' అనేది ద్రష్ట రూపంలో (చూచేవాని రూపంలో) ఉండేది. దేహమనేది దృశ్యరూపంలో అంటే, చూడటానికి విషయంగా వుండేది. మనం శరీరాన్ని గురించి మాట్లాడేటప్పుడు 'ఇది నాది' అని అంటున్నాం గదా ! (ఇది నా చేయి, ఇది నా తల అని ఈ విధంగా) దీనిని బట్టే శరీరమనేది ఒక వస్తువని, దృశ్యమని తెలుస్తోంది. కాబట్టి 'నేను'గా ద్రష్ట రూపంలో ఉండే ఆత్మ వేరు, ఆ 'నేను'కు చెందినట్టిదిగా, నేనుకు బయట ఉండే ఒక వస్తువుగా ఉండే శరీరం వేరు అని తెలుస్తోంది. కాబట్టి దృశ్యమైనట్ట శరీరాన్ని, ద్రష్టమైన ఆత్మగా అనుకునేందుకు అవకాశమే లేదు అని భావం.

*అహం వికార హీనస్తు దేహో నిత్యం వికారవాన్ ।*
*ఇతి ప్రతీయతే సాక్షాత్ కథం స్యాద్దేహక ః పుమాన్ ॥* 33

అహం (ఆత్మ) అనేది వికార రహితమైనది. అంటే, కాలాన్ని బట్టిగాని, వయస్సును బట్టిగాని, అవస్థా భేదాన్ని బట్టిగాని ఏ విధమైన మార్పూ లేనిది. బాల్య, యౌవన, వార్ధక్యాల్లోను, రాత్రింబవళ్ళయందు, జాగ్రదాది అవస్థలయందు, కష్టసుఖాలలోను ఏ విధమైన మార్పూ ఆత్మలో ఉండదు. ఇక దేహమో- సర్వదా, సర్వదా వికారములతో కూడినది- క్షణ క్షణం అన్ని విధాల మార్పు చెందుతూ ఉండేది. ఒక మనిషిని మనం అతని బాల్యంలోను, యౌవనంలోను, వార్ధక్యంతోనూ కూడా అతడు ఫలానా అనే అంటున్నాం గదా! అట్లాగే కష్టంలోను, సుఖంలోను, నిద్రించేటప్పుడు, మేల్కొన్నప్పుడు కూడా అతడిని ఫలానా వాడు అనే అంటున్నాం. అంటే, అయా పరిస్థితుల వల్ల శరీరంలోను, మనస్సులోను, మార్పు ఉన్నప్పటికి ఆత్మలో మార్పు అనేది లేదని స్పష్టం అవుతోంది గదా !

*యస్మాత్పర మితి శ్రుత్యా తయా పురుషలక్షణమ్ ।*
*వినిర్ణీతం విమూఢేన కథం స్యాద్దేహకః పుమాన్ ॥* 34

పండితులచేత 'యస్మాత్పరం' ఇత్యాదిగా గల శ్రుతి వాక్యాల ద్వారా (శ్వేతాశ్వతరోపనిషత్ 3 అధ్యాయం మం.9) పురుషుని యొక్క లక్షణాలు ఎటువంటివో నిరూపింపబడ్డవిగదా ! అటువంటప్పుడు ఈ దేహం పురుషుడెట్లా అవుతుంది?

*యస్మాత్పరం నా పరమస్తి కశ్చిద్యస్మా*
*న్నాణీ యోఽ నజ్యాయోఽ స్తి కశ్చిత్ ।*
*వృక్ష ఇవ స్తబ్ధో దివితిష్ఠ త్యేక స్తే*
*వేదం పూర్ణం పురుషేణ సర్వమ్ ॥*

(ఈ పురుషునికంటె గొప్పదైనదిగాని, సూక్ష్మమైనదిగాని, దీర్ఘమైనదిగానీ ఇంకేదీ లేదు. ఆ పురుషుడొక్కడే – ఆ పరమాత్మయే ఈ దివ్యమైన విశ్వంలో మహావృక్షంలాగా స్థిరంగా ఉన్నాడు – ఆ పురుషుని చేతనే ఈ విశ్వమంతా వ్యాప్తమై ఉంది". ఈవిధంగా పరమ బ్రహ్మణులైన ఋషులు చెప్పిన ఈ మంత్ర వాక్యాలను బట్టి ఆత్మ లక్షణం ఎటువంటిదో తెలుస్తోంది గదా! ఇక ఈ దేహాన్ని పురుషుడని ఎట్లా అనగలం?

***సర్వం పురుష ఏ వేతి సూక్తో పురుష సంజ్ఞి తే ।***

***అప్యుచ్యతే యతః శ్రుత్వా కథం స్యాద్దేహకః పుమాన్ ॥*** **35**

ఋగ్వేదాంతర్గతమైన పురుషసూక్తంలో "పురుష ఏ వేదగ్ం సర్వం యద్భూతం యచ్చభవ్యం । ఉతామృతత్వస్యేశానః యదన్నే నాతిరో హతి।" ఇత్యాదిగా గల ఋక్కులలో "ఈ సమస్తము ఆ పురుషుడే ! ఈ నామరూపాత్మకమైన విశ్వమంతా ఆ పురుషుడే ! భూతము, భవిష్యత్తు కూడా ఆ పురుషుడే ! భూతమూ, భవిష్యతూ కూడా ఆ పురుషుడే ! ఆనందానికి, అమృతత్వానికి అతడు ప్రభువు.....ఈ జీవులన్నీ తమ తమ కర్మల యొక్క ఫలాన్ని అనుభవించటానికై ఈ విశ్వాన్ని సృజించాడు." ఈ విదంగా ఆ పురుషుని గూర్చి శ్రుతి ప్రమాణం ఉన్నది గదా ! అటువంటప్పుడు ఈ దేహాన్ని పురుషుడని ఎట్లా అనగలం? ఈ దేహం ఆత్మ ఎట్లా కాగలుగుతుంది?

30వ శ్లోకంలో శ్రుతి ప్రమాణాల్ని విని ఆలోచించమని చెప్పారు గదా ! శ్రుతులతో ఎక్కడెక్కడ ఏమని చెప్పారో ఆ ప్రమాణాల్ని వరుసగా చూపిస్తున్నారు.

***అసంగః పురుషః ప్రోక్తో బృహదారణ్య కే౾ పిచ ।***

***అనన్తమల సంశ్లిష్టః కథం స్యాద్దేహకః పుమాన్ ॥*** **36**

బృహదారణ్య కోపనిషత్తులో కూడా పురుషుడ అసంగుడని చెప్పారు. అంతులేని మలముతలతో- పాపాలతో కూడిన ఈ దేహం పురుషుడెట్లా అవుతుంది?

(స వా ఏతస్మి స్సంప్రసాదే...భవత్యసంగోహ్యాయం పురుష ఇతి.... బృహదారణ్యకం 4వ అధ్యాయం 3వ ప్రబాహ్మణం 15-16 మంత్రాలలో యాజ్ఞవల్క్యుడు ఈ విధంగా అంటున్నాడు- "స్వయం జ్యోతియైన ఆత్మ జాగ్రత్ స్వప్న సుషుప్తులలో తాను చూచిన అన్నింటితోను అసంగుడుగానే- ఏమీ సంబంధం లేని వానిలాగానే ఉంటున్నాడు, అంటే ఆయాఅవస్థలలోని పుణ్యపాపాలేవీ ఆత్మకు అంటవు కాబట్టి ఆసక్తి జన్యమైన దోషాలతో పురుషుడు అలిప్తుడుగానే - ఏమీ అంటనివాడుగానే ఉంటున్నాడు. దేహమనేది అట్లాకాదు. అది పాపాలతో-మలాలతో కూడినది. కాబట్టి అది ఆత్మ కాదు అని భావం.

*తత్రైవ చ సమాఖ్యాతః స్వయంజ్యోతిర్హి పూరుషః ।*
*జడః పరప్రకాశ్యోఽ యం కథం స్యాద్దేహకః పుమాన్ ॥* 37

పై శ్రుతిలోనే (బృ. ఉ. 4. అ. 3 బ్రా. 7వ మంత్రం) జనకునితో యాజ్ఞవల్క్యుడు అన్నాడు– "కతమ ఆత్మేతి? యో యం విజ్ఞానమయః ప్రాణేషు....రూపాణి" అని. "ప్రాణాల్లో, బుద్ధివృత్తుల్లో ఉండే విజ్ఞాన జ్యోతి స్వరూపమైన పురుషుడే ఆత్మ. ఇంద్రియాల మధ్య స్వయం ప్రకాశమానమై హృదయంలో ఉండే పురుషుడే ఆత్మ. ఆ పురుషుడు, అసంగుడు నిర్లిప్తుడు" అని కూడా చెప్పారు. ఆత్మ అనేది స్వయంప్రకాశమానమైనది. మరి, ఈ శరీరమో! ఇతరమైనవాటిచేత ప్రకాశింపచేయబడుతోంది– ఇది జడం కాబట్టి. జడమై, స్వయంప్రకాశకత్వం లేని దేహం, ఆత్మ ఎట్లా అవుతుంది?

*ప్రోక్తోఽ పి కర్మకాండేన హ్యాత్మా దేహాద్వి లక్షణః ।*
*నిత్యశ్చ తత్ఫలం భుంక్తే దేహపాతాదన న్తరమ్ ॥* 38

కర్మకాండ్లో కూడా "ఆత్మ అనేది దేహంకంటె భిన్నమైనదని, అది నిత్యమైనదని చెప్పబడ్డది. అందుచేతనే దేహపాతం తరువాత కూడా తన కర్మల యొక్క ఫలాన్ని అనుభవిస్తోంది" అని చెప్పబడ్డది.

వేదాల్లో విద్యుక్త కర్మలను గురించి నిత్యనైమిత్తిక కర్మలను గురించి– యజ్ఞ యాగాదులను గురించి, వాటి ఫలితాన్ని గురించి, ఆయా కర్మలకు సంబంధించిన విధి నిషేధాదులను గురించి వివరింపబడ్డ భాగమే కర్మకాండ. ఈ కర్మకాండల్ని విశ్వసించేవారు ఈశ్వరుని– పరమాత్మను విశ్వసించరు. కాని శరీరం కంటె భిన్నమైనట్టి, శాశ్వతమైనట్టి వ్యష్టి ఆత్మను మాత్రం విశ్వసిస్తారు. అందుచేతనే, శరీరపాతం తరువాత (మరణించిన పిమ్మట) కూడా ఆత్మ అనేది తాను చేసిన కర్మల యొక్క ఫలాన్ని అనుభవించటం కోసం కర్మబద్ధమై మిగిలి ఉంటుందని చెపుతారు. కాబట్టి జ్ఞానకాండలోనే కాకుండా, ఈశ్వరుని విశ్వసించని కర్మకాండలో కూడా ఆత్మ అనేది శరీరం కంటె భిన్నమైన దొకటి ఉన్నట్లు చెప్పబడింది అనే విషయమే ఇక్కడ ప్రధానాంశం.

*లింగం చానేక సంయుక్తం చలం దృశ్యం వికారి చ ।*
*అవ్యాపక మసద్రూపం తత్కథం స్యాత్పుమానయమ్ ॥* 39

సూక్ష్మదేహం, (లింగ శరీరం) అనేక తత్త్వాల కలయికతో కూడి ఉంది. అది అస్థిరము, దృశ్యము, మార్పులు కలది, అవ్యాపకము– పరిమితమైనది, అసత్ స్వరూపం కలది. కాబట్టి ఈ సూక్ష్మదేహం మాత్రం ఆ పురుషుడెట్లా అవుతుంది? సూక్ష్మదేహం కూడా ఆత్మ కాదు అని భావం.

ఈ లింగ శరీరమనేది స్వప్నావస్థలో ఉండే శరీరం. ఇది 5 కర్మేంద్రియాలు, 5 జ్ఞానేంద్రియాలు, 5 ప్రాణాలు, మనస్సు, బుద్ధి అనే 17 భాగాలతో, తత్త్వాలతో కూడి ఉంది. పంచ ప్రాణాలకు బదులుగా పంచ తన్మాత్రలను చెపుతారు. ఈ సూక్ష్మ శరీరం కూడా స్వప్నం అయిపోగానే నశిస్తోంది. కాబట్టి అస్థిరం. స్వప్నంలో ఇది మనకు కనిపిస్తుంది కాబట్టి దృశ్యము. స్థూల శరీరం లాగానే ఇది కూడా పరిమితమై ఉంటుంది. ఇది కూడా అసత్ స్వరూపం కలది. శాశ్వతం, నిత్యం కాదు. కాబట్టి ఇది (లింగ శరీరం) కూడా ఆత్మ కాదు.

***ఏవం దేహ ద్వయాన్య ఆత్మా పురుష ఈశ్వరః।***
***సర్వాత్మా సర్వ రూపశ్చ సర్వాతీతో హ మావ్యయః॥*** **40**

ఈ విధంగా ఆత్మ (పురుషుడు– ఈశ్వరుడు ఈ స్థూల సూక్ష్మ శరీరాలు రెంటికంటె భిన్నమైనది. ఆత్మ పురుషుడు, ఈశ్వరుడు అనేమూడు పదాలూ ఒకే అర్థంలో వాడబడ్డాయి. కాబట్టి నేను (ఆత్మ) సర్వాత్మకుడను. సర్వరూపుడను. అవ్యయుడను. ఈ శరీరాలన్నింటికి అతీతమైనవాడను. సర్వాత్మకుడు అంటే అన్నిటియందు ఉన్న ఆత్మ– విశ్వరూపుడు. సర్వాతీతుడు అంటే అన్నిటిని మించినవాడు సర్వోత్కృష్టుడు.

## ద్వైత మిథ్యాత్వం

***ఇత్యాత్మదేహ భావేన ప్రపంచస్యైవ సత్యతా ।***
***యథోక్తా తర్క శాస్త్రేణ తతః కిం పురుషార్థ తా ॥*** **41**

ద్వైతభావం మిధ్య అని చెపుతున్నారు.

శంక : ఈ విధంగా– తర్క శాస్త్రంలో ప్రతిపాదించి నట్లుగా, ఆత్మకు దేహానికి ఉన్న భేదాన్ని అంగీకరించినప్పటికి, ఈ ప్రపంచ యొక్క సత్యత్వం ఉండనే ఉంటుంది. ఇక ఇందువల్ల సిద్ధించే పురుషార్థం ఏమి ఉన్నది? అని.

ఈ ప్రపంచం అనేది ప్రకృతి పురుష సంయోగంవల్ల ఏర్పడ్డదనే సాంఖ్య సిద్ధాంతాన్ని అనుసరించి తార్కింగా చూచిన ఈ ప్రపంచ సృష్టికి కారణభూతమైన ప్రకృతి (స్థూలమైన బాహ్యపదార్థ తత్త్వం) తో బాటు పురుషుని (ఆత్మ) యొక్క సంయోగం ఉండనే ఉంటుంది గదా ! ఆత్మ సత్యమని మీరు అన్నప్పుడు,ఆ ఆత్మ యొక్క సంయోగంలో ఉన్న ప్రకృతి కూడా సత్యమేగదా ! అటువంటప్పుడు మనం ఈ ఆత్మకు శరీరానికి భేదాన్ని చూచినందువల్ల మనం సాధించగలిగే పురుషార్థం ఏమిటి? ఇది తార్కికంగా వేసే ప్రశ్న.

లోగడ ఆత్మకు శరీరానికి ఉన్న భేదాన్ని చెప్పటంలో ఉన్న ఉద్దేశ్యం శరీరం సత్యమని భావించేవారి భావన సరియైనది కాదు అని చెప్పడానికే తప్ప శరీరము ఆత్మలయొక్క భిన్నత్వాన్ని సమర్థించటానికి కాదు. ఇక ముందు రాబోయే శ్లోకాల్లో శరీరమనేది ప్రత్యేకంగా ఏదీ లేదనినీ, ఉన్నదేదో ఆత్మ ఒక్కటే అనీ చెపుతారు.

***ఇత్యాత్మ దేహభేదేన దేహాత్మత్వం నివారితం ।***
***ఇ దానీం దేహ భేదస్య హ్యసత్త్వం స్ఫుట ముచ్యతే ॥*** **42**

పై శంకకు సమాధానం చెపుతున్నారు–

ఇంతవరకు ఆత్మకు దేహానికి భేదాన్ని చూపిస్తూ దేహమే ఆత్మ అని భావించే వారి అభిప్రాయాన్ని నిరాకరించారు. ఇక ఇప్పుడు దేహానికి ఆత్మకు భేదాన్ని చూడటం అనవసరం అనీ, (దేహభేదం = దేహం ఆత్మ కంటె భిన్నమైనదని అనుకోవటం) స్పష్టంగా చెపుతున్నారు.

అంటే, ఆత్మ లేకుండా శరీరానికి అస్థిత్వం లేదు. నీరు లేకుండా అలలు ఎట్లా ఉండవో అట్లాగే ఆత్మ లేకుండా కేవలం శరీరాలు ఉండలేవు. ఆత్మలేని శరీరాలు శవాలౌతాయిగాని శరీర మనిపించుకోవు. కాబట్టి ఉన్నదేదో ఆత్మ అనేది ఒకటే అని తేలుతోంది. అజ్ఞానం వల్లనే శరీరాలు భిన్నభిన్నంగా ఉన్నాయని అనుకుంటున్నాము.కాని, అన్ని అలలలోను ఉన్నది నీరు అయినట్లే అన్ని శరీరాల్లోను ఉన్నది ఆత్మే ! కాబట్టి ఈ ద్వైతభావం కేవలం మిథ్య (అజ్ఞానం) అని తేలుతోంది.

***చైతన్యస్యైక రూపత్వాద్భేదో యుక్తో వ కర్హి చిత్ ।***
***జీవత్వం చ మృషా జ్ఞేయం రజ్జౌ సర్పగ్రహో యథా ॥*** **43**

శుద్ధ చైతన్యంలో భిన్నత్వం చూడటం (ద్వైత భావం) వ్యర్థం అని చెపుతున్నారు. చైతన్యమనేది ఎల్లప్పుడు ఒకే విధంగా ఉంటుంది– అది ఏక రూపత్వం కలది. ఆ చైతన్యంలో ఏ విధమైన ద్వైతభావాన్నైనా చూడటం సరికాదు. త్రాడులో సర్పం గోచరించటం మిథ్య అయినట్లే, ఆత్మలో జీవభావం గోచరించటం కూడా మిథ్య అనే గ్రహించాలి, చైతన్య స్వరూపాలు భిన్నంగా కనిపించినప్పటికి ఆ స్వరూపాల్లోని చైతన్యం ఒకటే అని గ్రహించాలి. వేరు–వేరు వస్తువుల్ని ప్రకాశింపజేసే సూర్యకాంతి ఒకటే గదా! అట్లాగే వేరు వేరు జీవుల్లో కనిపించే చైతన్యం కూడా ఏకరూపమైనదే ! ద్వైతభావం మిథ్య.

***రజ్జ్వ జ్ఞానాత్ క్షణేనైవ యద్వద్రజ్జుర్హి సర్పిణీ ।***
***భాతి తద్వచ్చితి ఃసాక్షాద్విశ్వాకారేణ కేవలా ॥*** **44**

ఆ శుద్ధ చైతన్యమే అజ్ఞానం వల్ల ప్రపంచంగా భాసిస్తోంది అని చెపుతున్నారు.

ఒక్కక్షణంలో త్రాడు మన అజ్ఞానం వల్ల పాముగా కనిపించినట్లే ఏ విధమైన మార్పు లేకుండానే ఈ చైతన్యం ఈ విశ్వరూపంలో మనకు గోచరిస్తోంది. అంటే, త్రాడును మనం పాము అని అనుకున్నప్పుడుగాని, ఆ అజ్ఞానం తొలగి అది త్రాడు అని మనం తెలుసుకున్నప్పుడుగాని, ఆ త్రాడులో జరిగిన మార్పు ఏదీ లేదు. అట్లాగే చైతన్యంలో ఏమీ మార్పు ఉండదు. కాని మన అజ్ఞానం ఉన్నంతవరకు అది విశ్వంగా– ప్రపంచంగా భాసిస్తుంది.

***ఉపాదానం ప్రపంచస్య బ్రహ్మణో న్యత్ర విద్య తే ।***
***తస్మా త్పర్వప్రపంచో యం బ్రహ్మైవాస్తి న చేతరత్ ॥*** **45**

ఈ ప్రపంచానికి పరబ్రహ్మ తప్ప ఉపాదన కారణమైనది వేరొకటి ఏదీ లేదు. కాబట్టి, ఈ విశ్వమంతా పరబ్రహ్మమే తప్ప మరొకటి ఏదీ కాదు. ఎందుచేతనంటే, కార్యమనేది కారణానికి భిన్నంగా ఎన్నడూ ఉండలేదు. ఉదాహరణగా చెప్పుకోవాలంటే, కుండ అనేది కార్యం. దానికి కారణమైన మట్టి లేకుండా కుండ ఉండలేదు. కుండ, మూకుడు, బాన వంటి అనేక ఆకారాలూ  పేర్లూ కలిగిన ఎన్ని వస్తువులున్నా వాటి అన్నింటిలోను వాటికి కారణమైన మట్టి ఉండనే ఉంటోంది. ఈ నామరూపాలన్నీ ఆశాశ్వతాలైనా, వాటికి కారణభూతమైన మట్టి మాత్రం సత్యం. అట్లాగే ఈ విశ్వంలో ఎన్ని నామరూపాలు గల స్థావర జంగమాదులున్నా వీటి అన్నింటిలోను వీటికి కారణమైన పరబ్రహ్మమే ఉన్నందున ఈ సమస్త విశ్వము బ్రహ్మమే అని అన్నారు. అదే సత్యం.

***వ్యాప్య వ్యాపకతా మిథ్యా సర్వమాత్మేతి శాసనాత్ ।***
***ఇతి జ్ఞాతే పరేతత్త్వే భేదస్యావసర ః కుత ః ॥*** **46**

ఈ సమస్త విశ్వము ఆత్మయే కాబట్టి,  జగత్తు బ్రహ్మ అనే ఈ రెంటిలోను వ్యాప్య వ్యాపకభావాన్ని చూడటం మిథ్య అని శ్రుతి (శాసనం) చెపుతోంది. ఈ పరమసత్యాన్ని తెలుసుకుంటే ఇక భేదభావానికి (కార్య కారణాల  మధ్య భేదం చూడటానికి) ఇక తావు ఎక్కడిది?

బృహదారణ్యకం 4వ అధ్యాయం 5వ బ్రాహ్మణం. 7వ మంత్రంలో– పర్వం వేదేదం బ్రహ్మేదం క్షత్రమిమే లోకా ఇమేదేనవా ఇమేదేవా ఇమాని భూతానీదగ్ం పర్వం యదయ మాత్మా" అని చెప్పబడ్డది. ఈ బ్రాహ్మణ క్షత్రియాది జాతులు లోకాలు, దేవతలు, వేదాలు, భూతాలు, సమస్తమూ ఆత్మయే తప్ప అన్యమేదీ కాదు" అని.

***శ్రుత్యా వివారితం నూనం నానాత్వం స్వముఖేన హి ।***
***కథం భాసో భవేదన్యః స్థితే చాద్వయ కారణే ॥*** **47**

స్వయంగా శ్రుతియే ఈ నానాత్వాన్ని– ప్రపంచం వేరు, ఆత్మవేరు అనే భావాన్ని– నిషేధిస్తోంది. కారణం అనేది అద్వితీయమైనప్పుడు– ఒకటే అయినప్పుడు – ఇక మరొక విధంగా ఎట్లా భాసిస్తుంది? అనేకంగా కనిపించటానికి వీలు లేదు అని భావం. పరబ్రహ్మ (ఆత్మ) అద్వితీయమైనప్పుడు– రెండవదంటూ లేనప్పుడు – ఆ ఆత్మ, ఇంకొకదానికి కారణం మాత్రం ఎట్లా అవుతుంది? అజ్ఞానంవల్ల మాత్రమే మనం 'ఈ విశ్వానికి ఆత్మ కారణం' అని అనుకుంటున్నాం. అంటే ఈ ప్రపంచానికి, పరబ్రహ్మకు అభేదాన్నే చెప్పారు.

ఈ సందర్భంలో శ్రుతి – బృ.ఉ.4 అధ్యాయం 4 బ్రా 19 మంత్రంలో – "మనసైవానుదృష్టవ్యం నేహ నానాస్తి కించన, మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" పరమాత్మలో అనేకత్వం – నానాత్వం అంటూ ఏదీ లేదు. భేదదర్శియైనవాడు ఒక మృత్యువునుండి ఇంకొక మృత్యువుకు పోతాడు – అంటే, పుడుతూ చస్తూ ఉంటాడు" అని. ఐ

***దోషోఽపి విహితః శ్రుత్యా మృత్యోర్మృత్యుం స గచ్ఛతి ।***
***ఇహ పశ్యతి నానాత్వం మాయయా వంచితో నరః ॥*** **48**

"ఒక మృత్యువు నుండి వేరొక మృత్యువుకు పోతాడు" అని చెప్పి, శ్రుతి, నానాత్వ దర్శనంలో గల దోషాన్ని చెప్పింది. మానవుడు మాయ వల్ల మోసగింపబడి మాత్రమే ఈ ప్రపంచంలో నానాత్వాన్ని చూస్తున్నాడు– ప్రపంచం వేరు, పరబ్రహ్మ వేరు అని అనుకుంటున్నాడు. అంటే, అద్వితీయమైన ఆత్మానుభూతిని పొందినవాడు మాత్రమే ఈ మృత్యుచక్రం నుండి తప్పించుకోగలుగుతాడు.

ఇంతవరకు ద్వైత మిథ్యత్వాన్ని విశదీకరించారు. ఇక జగత్తే బ్రహ్మ స్వరూపం అని చెపుతున్నారు.

# జగద్బ్రహ్మ స్వరూపం

***బ్రహ్మణః సర్వభూతాని జాయన్తే పరమాత్మనః ।***

***తస్మాదేతాని బ్రహ్మైవ భవన్తీత్యవధారయేత్ ॥*** **49**

సమస్త భూతాలూ పరమాత్మ నుండే ఉత్పన్నమైనాయి, అవుతున్నాయి. కాబట్టి ఈ జీవరాసులన్నీ ఆ పరబ్రహ్మమే అని నిశ్చయించుకోవాలి.

ఈ చెప్పిన విషయానికి శ్రుతి ప్రమాణం– తై. ఉ.భృగువల్లి 1వ అనువాకం. "యతో వా ఇమాని భూతాని జాయన్తే. యేన జాతాని జీవన్తి. యత్ప్రయ న్త్యభిసం విశన్తి. తద్వి జిజ్ఞాసస్వ. "ఏ పరబ్రహ్మ నుండి సమస్త భూతాలూ పుడుతున్నాయో, పుట్టినవన్నీ ఎవనివల్ల జీవిస్తున్నాయో, అంత్యకాలంలో అవన్నీ ఎవనిలో లీనమౌతున్నాయో అదే బ్రహ్మ అని తెలుసుకో !"అని.

***బ్రహ్మైవ సర్వనామాని రూపాణి వివిధానిచ ।***

***కర్మాణ్యపి సమగ్రాణీ బిభర్తీతి శ్రుతిర్జగౌ ॥*** **50**

ఈ సమస్తమైన నామరూపాలను, సమస్త కర్మలను ధరించేది, భరించేదీ ఆ పరబ్రహ్మమే!" అని శ్రుతి స్పష్టంగా చెపుతోంది. అంటే, ఈ ప్రపంచంలో అనేక పేర్లు, రూపాలు గల వస్తువులు, జీవాలు ఉన్నాయి. అవన్నీ వేరు వేరు పనులు చేస్తూ ఉంటాయి. ఈ నామరూపాలకు, పనులకు ఆ పరబ్రహ్మమే కారకుడు. ఎట్లాగంటే త్రాడును చూచి మనం పాము అని అనుకుంటున్నాము. లేక ఇంకొకటి అనుకుంటున్నాము– భ్రమపడుతున్నాము. ఈ భ్రమలన్నింటికి ఒక ఆధారం ఉండాలి. ఆ ఆధారం త్రాడు. అట్లాగే, మనం అనేక నామరూప క్రియాదులను భ్రమిస్తున్నాం. ఆ భ్రమకు ఆధారం పరమాత్మే ! అని భావం.

***సువర్ణా జ్జాయమానస్య సువర్ణత్వం చ శాశ్వతమ్ ।***

***బ్రహ్మణో జాయమానస్య బ్రహ్మత్వం చ తథా భవేత్ ॥*** **51**

బంగారంతో తయారైనట్టి అనేక నామరూపాలు గల వస్తువులలో బంగారానికి ఉండే గుణాలు, లక్షణాలు (సువర్ణత్వం) ఎల్లప్పుడు అన్నీ ఉన్నట్లే, పరబ్రహ్మ నుండి పుట్టిన ఈ సమస్త జీవజాలంలోనూ ఆ పరబ్రహ్మ యొక్క లక్షణాలు (బ్రహ్మత్వం) శాశ్వతంగా ఉండనే ఉంటాయి.

***స్వల్ప మస్యన్తరం కృత్వా జీవాత్మ పరమాత్మనోః ।***
***యః సంతిష్ఠతి మూఢాత్మ భయం తస్యాభిభాషితమ్ ॥*** **52**

జీవాత్మ పరమాత్మల మధ్య ఏ స్వల్పమైన భేదాన్నైనా చూచే మూడునికి మాత్రమే భయమనేది ఉంటుందని శ్రుతి చెపుతోంది. జ్ఞానియైన వానికి ఈ భేదభావం ఉండదు. కాబట్టి భయం ఉండదు. అజ్ఞానానికి మాత్రమే ఈద్వైత భావం వల్ల భయమనేది ఉంటుంది.

ఈ విషయానికి శ్రుతి ప్రమాణం- తైత్తిరీయం- ఆనందవల్లి 7వ అనువాకం - "యదాహ్యేవైష ఏతస్మిన్నుదర మంతరంకరుతే. అథ తస్య భయం భవతి. తత్త్వేవ భయం విదుషో మన్వా నస్య." "ఈ భేద దృష్టివల్లనే అజ్ఞానికి భయం కలుగుతోంది. భేదదర్శియైన అజ్ఞానికి ఆ బ్రహ్మమే భయకారణమౌతోంది" అని.

***యత్రా జ్ఞానాద్ భవేద్ ద్వైత మితర స్తత్ర పశ్యతి ।***
***ఆత్మత్వేన యదా సర్వం నేత స్తత్ర చాణ్వపి ॥*** **53**

అజ్ఞానం వల్ల ద్వైత భావం కలుగుతుంది. ద్వైతభావం ఉన్నప్పుడే ఒకడు మరియొకనిని చూస్తాడు. అంటే, తానువేరు, ఇతరులు వేరు అని భావిస్తాడు. సమస్త ఆత్మరూపంగానే కనిపించినప్పుడు ఇతరమైనదేదీ ఉండదు.

ఈ విషయమే బృహ ఉ. 4వ అ. 5వ బ్రా. 15వ మంత్రంలో "....యత్ర త్వస్య సర్వ మాత్మై వాభూత్తత్కేన కం పశ్యేత్తత్కేనక ం జిఘ్రే త్తత్కేన.... "అన్నీ తానే అయినప్పుడు- అద్వైతస్థితిని పొందినప్పుడు ఇక ఎవడు ఎవనికి చూస్తాడు?....అని.

***యస్మిన్ సర్వాణి భూతాని హ్యాత్మత్వేన విజానతః ।***
***న వైతస్య భవేన్మోహోన చ శోకోఽ ద్వితీయతః ॥*** **54**

ఈ విధమైన అద్వితీయ స్థితిలో (రెండవదంటూ లేని స్థితిలో) సమస్త భూతాలను తానుగానే భావించే మహాత్మునికి, తాను తప్ప మరి ఇతరులెవరూ ఉండనందున మోహంగాని భయంగాని ఉండదు.

ఈ విషయానికి శ్రుతి ప్రమాణం- ఈశావాశ్యోప నిషత్తులో 7వ మంత్రం ఈ విధంగా ఉంది.

***యస్మిన్సర్వాణి భూతాన్యాత్మైవా భూ ద్విజానత ః।***
***తత్ర కోమోహః కః శోక ఏకత్వ మనుపశ్యతి ॥*** **54**

సర్వభూతాత్మయే తాను అని భావించే జ్ఞానికి దుఃఖమూ లేదు, మోహమూ లేదు. శోకమోహాలు ద్వైతభావం గల ఆజ్ఞానికి మాత్రమే ఉంటాయి అని భావం.

***అయమాత్మా హి బ్రహ్మైవ సర్వాత్మకతయా స్థితః।***
***ఇతి నిర్ధారితం శ్రుత్యా బృహదారణ్య సంస్థయా ॥*** **55**

'ఈ ఆత్మయే సర్వాత్మ భావంతో కూడిన పరబ్రహ్మము' అని శ్రుతిశాఖయైన బృహదారణ్యకోపనిషత్తు 2వ ఆధ్యాయం 5వ బ్రాహ్మణం 19వ మంత్రంలో నిర్ణయింపబడ్డది- "అయమాత్మా బ్రహ్మ సర్వానుభూః" అని. ఇంతవరకు అద్వితీ యాత్మను గురించి చెప్పి, తరువాతి శ్లోకాల్లో జాగ్రత్ స్వప్న సుషుప్తులనే మూడు అవస్థలు, ఈ ప్రపంచం కూడా మిధ్య అని చెపుతున్నారు.

# ప్రపంచ మిథ్యాత్వం

***అనుభూతోஉ ప్యయం లోకో వ్యవహారక్షమోஉ పి సన్ ।***

***అసద్రూపో యథా స్వప్న ఉత్తరక్షణ బాధతః ॥*** **56**

ఈ ప్రపంచ మనేది మనకు వ్యవహార యోగ్యంగా, అనుభవయోగ్యంగా కనిపించినప్పటికి మరుక్షణంలోనే మాయమైపోయే స్వప్న ప్రపంచం లాంటిది కాబట్టి ఇది అసద్రూపం కలది– అసత్యమైనది. స్వప్నంలో వ్యవహరిచినట్లే, స్వప్నంలో అనుభూతులు పొందినట్లే ఈ ప్రపంచంలో కూడా మనం మిథ్యా వ్యవహారాలను, మిథ్యానుభూతుల్ని పొందుతున్నాము. కాబట్టి స్వప్నంగానే ఈ ప్రపంచం కూడా అసత్యం, ఆనిత్యం.

స్వప్నం ఉన్నంతవరకే మన వ్యవహారాలు, అనుభూతులూను, మెలకువ రావటంతోనే అవన్నీ మాయమైపోతున్నాయి. అట్లాగే మనం జాగ్రదవస్థలో వ్యవహరించే స్థితులు, అనుభూతులు స్వప్నంలోకి సుషుప్తిలోకి జారుకోవటంతోనే మాయమైపోతున్నాయి. అట్లాగే మనం సుషుప్తిలోకి చేరటప్పటికి జాగ్రత్ స్వప్న అవస్థలలోని అనుభూతులు అన్నీ మాయమైపోతున్నాయి. మళ్ళీ జాగ్రద వస్థలోకిరాగానే స్వప్నసుషుప్తులలోని అనుభూతుల మాయమైపోతున్నాయి. కాబట్టి ఈ ప్రపంచం అనేది జాగ్రదవస్థలాంటిది. ఇది స్వప్నావస్థలాగానే అనిత్యమైనది– ఆసత్యమైనదీను.

***స్వప్నో జాగరణేஉ లీకః స్వప్నే పి న హి జాగరః ।***

***ద్వయమేవ లయే నాస్తి లయోஉ పి హ్యుభయోర్న చ ॥*** **57**

జాగృతిలో స్వప్నానుభవాలన్నీ అసత్యమైపోతాయి. అట్లాగే స్వప్నంలో జాగృతిలోని అనుభవాలు అసత్యమైపోతాయి. సుషుప్తిలో జాగ్రత్ స్వప్నాలు రెండూ ఉండవు– రెండూ లయమైపోతాయి. జాగ్రత్ స్వప్నాలు రెంటిలోనూ సుషుప్తి అనేది ఉండదు. కాబట్టి ఆలోచిస్తే ఈ మూడు అవస్థలూ కూడా ఆసత్యాలే అని తేలుతుంది. అంటే మిథ్యలే ! ఈ మూడూ ఒకదానికొకటి వ్యతిరిక్తమైనవి. ఈ విషయాన్నే తరువాతి శ్లోకంలో వివరిస్తున్నారు.

*త్రయమేవం భవేన్మిథ్యా గుణత్రయ వినిర్మితమ్ ।*

*అన్య ద్రష్టా గుణాతీతో నిత్యో హ్యేకశ్చిదాత్మక ః ॥* **58**

ఈ విధంగా సత్త్వరజస్తమో గుణాలవల్ల ఉత్పన్నమైనట్టి ఈ మూడు అవస్థలు మిథ్యయే । కాని, ఈ మూడింటికి అతీతంగా ఉండేటటువంటి, ఈ మూడు గుణాలకు అతీతమైనట్టి, అద్వితీయమైనట్టి, చిత్ స్వరూపమైనట్టి ఆత్మయే (వీటి అన్నింటికి అతీతంగా) ద్రష్టగా ఉంటుంది.

మన ఎదుట ఉన్న ఈ జగత్తు అంతా సత్వరజస్త మస్సులనే మూడు గుణాల కలయికవల్ల ఏర్పడ్డది. ఈ మూడు గుణాలవల్లనే జాగ్రత్ స్వప్న సుషుప్తులనే మూడు అవస్థలు ఏర్పడ్డాయి. ఈ విధమైన కలయిక వల్ల ఏర్పడ్డ ఈ ప్రపంచం నశ్వరమే ! పుట్టిన ప్రతిదీ నశించటం తప్పనిసరి కాబట్టి; ఈ ప్రపంచం మిథ్య అని తేలుతోంది. కాని, ఈ విధంగా క్షణక్షణం మార్పు చెందుతూన్న ఈ ప్రపంచంలో ఈ మార్పులను, ఈ అవస్థలను అన్నింటిని చూస్తూ సాక్షిగా ఈ మూడు గుణాలకు అతీతంగా ఉండేది ఆత్మయే ! అదే నిత్యం. దానికి ఏ విధమైన మార్పూ ఉండదు.

*యద్వన్మృది ఘటభ్రాంతిం శుక్తౌ వా రజతస్థితమ్ ।*

*తద్వద్బ్రహ్మణి జీవత్వం భ్రాన్త్యా పశ్యతి న స్వతః ॥* **59**

అయితే, వివిధ జీవరాసులు ఈ విధంగా వేరు వేరు జీవులుగా కనిపించటానికి కారణం ఏమిటి? అనే ప్రశ్నకు సమాధానంగా చెపుతున్నారు.

మానవుడు భ్రమకు లోనై మట్టిలో కుండను, ముత్యపుచిప్పలో వెండిని చూస్తూ ఉన్నట్లే, భ్రమకు- మాయకు లోనై బ్రహ్మలో ఈ విధమైన జీవభావాన్ని చూస్తున్నాడు. అంతేతప్ప స్వతః ఉన్నది పరబ్రహ్మమే !

అజ్ఞానానికి లోబడి ఉన్నంతవరకు మనం జీవులమని భ్రమిస్తూ ఉంటాము. అజ్ఞానం పోయి, జ్ఞానోయదం కాగానే జీవులమనే భావంపోయి బ్రహ్మ అనే భావం కలుగుతుంది. అజ్ఞానం వల్ల పరబ్రహ్మను జీవిగా భావిస్తున్నామన్న మాట.

***యథా మృది ఘటోనామ కనకే కుండలాభిధా ।***

***శుక్తౌ హి రజత ఖ్యాతి ర్జీవశబ్ద స్తథా పరే ॥*** **60**

మట్టిని కుండ అనటం, బంగారాన్ని కండలమనే పేరుతో పిలవటం, ముత్యపు చిప్పను వెండి అనటం ఇదంతా నామమాత్రమే ! పరబ్రహ్మను జీవశబ్దంతో వ్యవహరించటం కూడా నామమాత్రమే ! యదార్థం కాదని భావం.

'కుండ' అని మనం అన్నప్పటికి యథార్ధానికి అదిమట్టే ! 'కుండలం' అని పేరు పెట్టినా యథార్థానికి అది బంగారమే తప్ప వేరుకాదు. మనం భ్రమ వల్ల వెండి అని అన్నా, లేక మరొక పేరుతో పిలిచినా అది ముత్యపు చిప్పే తప్ప అన్యం కాదు. అట్లాగే మనం జీవుడని లేక ఏ పేరుతో పిలిచినా పరబ్రహ్మమే తప్ప వేరు కాదు.

***యథైవ వ్యోమ్ని నీలత్వం యథా నీరం మరుస్థలే ।***

***పురుషత్వం యథాస్థాణౌ తద్వ ద్విశ్వం చిదాత్మని ॥*** **61**

ఆకాశంలో నీలత్వము, మరుభూమిలో నీరు, మొండెంలో పురుషాకారం, కనిపించినట్లుగా ఆ చిదాత్మలో ఈ విశ్వం కూడా భాసిస్తూ ఉంటుంది.

కేవలం జీవుడేకాక ఈ విశ్వమంతా కూడా భ్రమ వల్ల మనకు ఇట్లా కనిపిస్తోంది. బ్రహ్మలో జీవభావంలాగానే, బ్రహ్మలో విశ్వభావం కూడాను, ఆకాశంలో నీలవర్ణం కనిపిస్తుంది. కాని ఆకాశానికి రంగు లేదు. ఎడారిలో ఎండమావులు నీరులాగా కనిపిస్తాయి. ఎండమావుల్లో నీరు లేదు. అట్లాగే స్తంభంలో ఒక మనిషి ఆకారం కనిపించవచ్చు. అట్లాగే పరబ్రహ్మలో ఈ విశ్వం యొక్క ఈ విధమైన ఆకారం కనిపిస్తోంది. యథార్థానికి ఉన్నదేదో చైతన్యరూపమైన ఆత్మ ఒక్కటే ! అని భావం.

***యథైవ శూన్యే వైతాలో గంధర్వాణాం పురం యథా ।***

***యథాకాశే ద్వి చంద్రత్వం తద్వత్సత్యే జగత్ స్థితిః ॥*** **62**

శూన్యంలో దయ్యాలు ఉన్నట్లు, గంధర్వలోకాలు– ఆకాశ హార్మ్యలు ఉన్నట్లు, ఆకాశంలో ఇద్దరు చంద్రులు కనిపించినట్లుగానే ఈ పరమసత్యమైన బ్రహ్మలో ఈ జగత్తు కూడా కనిపిస్తోంది.

మనకు శూన్యంలో దయ్యాలు భూతాలు కనిపించ వచ్చు. ఆకాశంలో గంధర్వలోకాలు, కోటలు కనిపించవచ్చు. అట్లాగే భ్రమ వల్ల ఆకాశంలో ఇద్దరు చంద్రులున్నట్లు కనిపంచవచ్చు. ఇదంతా భ్రమ వల్లనే ! ఉన్నదేదో ఆకాశమే ! అట్లాగే పరమసత్యమైన పరబ్రహ్మలో ఈ ప్రపంచం అంతా ఈ విధంగా భాసిస్తోంది.

***యథా తరంగ కల్లోలైర్జలమేవ స్ఫురత్యలమ్ ।***
***పాత్రరూపేణ తామ్రం హి బ్రహ్మాండౌ మైస్త థాత్మతా ॥*** **63**

మనకు తరంగమాలికల రూపంలో జలం మాత్రమే ఎట్లా స్ఫురిస్తుందో, పాత్రల రూపంలో రాగి మాత్రమే ఎట్లా స్ఫురిస్తుందో అట్లాగే ఈ బ్రహ్మాండ భాండ సమూహ రూపంలో ఆత్మ మాత్రమే స్ఫురిస్తుంది అంటే, పెద్దవి చిన్నవి నురుగులు గ్రక్కుతున్నవి అయిన కెరటాలు ఎన్ని కనిపించినా మనకు వాటిలోని నీరే స్ఫురిస్తుంది. నీరులేని కెరటాలు ఉండవు గదా ! అట్లాగే ఏ రూపంలో ఉండే పాత్ర అయినా అవి నిర్మింపబడిన లోహం (రాగి వగైరా) మాత్రమే స్ఫురిస్తుంది. అదే విధంగా ఈ విశ్వంలో ఎన్నెన్ని గోళాలు, గ్రహాలు, బ్రహ్మాండాలు ఉన్నా వాటి అన్నింటిలోనూ పరమాత్మ స్వరూపం మాత్రమే గోచరిస్తుంది అని భావం.

***ఘట నామ్నా యథా పృథ్వీ పట నామ్నా హి త స్తవః ।***
***జగన్నామ్నా చిదాభాతి జ్ఞేయం తత్తదభావతః ॥*** **64**

ఘటం (కుండ) అనే పేరు చెప్పటంతోనే ఆ కుండకు కారణభూతమైన మట్టి మనకు భాసిస్తుంది– మన మనస్సులో తోస్తుంది. అట్లాగే వస్త్రం పేరు చెప్పటంతోనే, ఆ వస్త్రానికి కారణభూతమైనట్టి నూలు తంతువులు (దారం) భాసిస్తాయి. అట్లాగే ఈ జగత్తు పేరు చెప్పటంతోనే ఆ పరమాత్మ భాసిస్తుంది. మనం జగత్తు అనే అడ్డంకిని తొలగించుకొని యదార్థమైన ఆత్మను దర్శించాలి. అంటే మనకు అడ్డుగా ఉన్న నామరూపాలను తొలగించుకొంటే మిగిలేది ఆ పరమాత్మే ! అని భావం.

ఇంతవరకు ప్రపంచం మిథ్య అని చెప్పారు. ఇక ఆ బ్రహ్మ యొక్క సర్వాత్మకతను చెపుతున్నారు.

# బ్రహ్మ యొక్క సర్వాత్మకత

***సర్వో౽ పి వ్యవహారస్తు బ్రహ్మణః క్రియతే జనైః ।***

***అజ్ఞానాన్న విజానన్తి మృదేవ హి ఘటాదికమ్ ॥*** **65**

ఈ సమస్త జీవరాసుల ద్వారా జరిగే వ్యాపారాలన్నీ- పనులన్నీ ఆ పరబ్రహ్మ యొక్క శక్తి వల్లనే జరుగుతున్నాయి. కాని, ఈ జీవులకు ఆ విషయం తెలియదు. వాస్తవానికి ఘటాదుల్లోని (కుండలు మొదలైన వాటిలో) శక్తి మట్టిదే కదా ! మనం కుండలను ఉపయోగిస్తున్నామని అనుకుంటామేగాని యథార్థంగా ఉపయోగించేది మట్టినే ! అట్లాగే ఈ ప్రపంచంలో వేరు చేయటానికి వీలు లేని ఈ మన వ్యవహారాలన్నీ ఆ పరబ్రహ్మ వల్లనే జరుగుతన్నాయి అనే విషయాన్ని అజ్ఞానంవల్ల గ్రహించలేకపోతున్నాం. ఈ సమస్తము పరబ్రహ్మ వల్లనే జరుగుతున్నాయి అనే విషయాన్ని అజ్ఞానంవల్ల గ్రహించలేక పోతున్నాం. ఈ సమస్తము పరబ్రహ్మమే ! ఇదే బ్రహ్మయొక్క సర్వాత్మకత్వం అంటే.

***కార్య కారణతా నిత్యమాస్తే ఘట మృద్యోర్యథా ।***

***తథైన శ్రుతియుక్తిభ్యాం ప్రపంచ బ్రహ్మణో రిహ ॥*** **66**

ఘటము, మృత్తిక, ఈ రెంటి కార్యకారణత్వం నిత్యమైనది. (ఘటం కార్యం, మృత్తిక కారణం) అట్లాగే ఈ జగత్తు పరబ్రహ్మల యొక్క కార్యకారణత్వం కూడా నిత్యమైనదే అనే విషయం మనకు శ్రుతి ద్వారా యుక్తిద్వారా తెలుస్తూనే ఉంది. అంటే ఘటాదుల్లో, కారణ రూపంలో అంతటా, ఎల్లప్పుడూ మృత్తిక ఉంటూన్నట్లే ఈ జగత్తులో అంతటా ఎల్లప్పుడూ పరమాత్మ ఉండనే ఉంటుంది. ఈ కార్యకారణ సంబంధం (జగత్తుకు పరమాత్మకు ఉండే సంబంధం) వేరు చేయరానిది. ఈ విషయమే శృతి- ఛాందోగ్యోపనిషత్తు 6వ అధ్యాయం 8వ ఖండం 7వ మంత్రంలో "స య ఏషో ణిమైతదాత్మ్య మిదగ్ం సర్వం తత్సత్యం న ఆత్మా తత్త్వమసి...." ఈ జగత్తుకు మూలకారణంగా ఏ సూక్ష్మమైన సారాన్ని చెప్పామో అదే ఈ సమస్త జగత్తూను. ఆ సూక్ష్మమైన సారమే ఆత్మ. అదే సత్యం చెప్పామో అదే ఈ సమస్త జగత్తూను. ఆ సూక్ష్మమైన సారమే ఆత్మ. అదే సత్యం అని చెప్పబడ్డది. ఈ ఉపనిషత్తులోనే . 3. ఖం. 14 మం. 1 లో "సర్వం ఖల్విదం బ్రహ్మ-" ఈ జగత్తంతా ఆ

పరబ్రహ్మమే అని చెప్పబడ్డది. ఈ విధంగా శ్రుతి ప్రమాణము, ఘటాదుల్లో యుక్తి ప్రమాణము చూపించారు.

***గృహ్యమాణే ఘటే యద్వన్మృత్తికా భాతివై బలాత్ ।***
***వీక్ష్యమాణే ప్రపంచేఽ పి బ్రహ్మైవాభాతి భాసురమ్ ॥*** **67**

మనం ఒక ఘటాన్ని (కండను) చూచినప్పుడు ఆ ఘంలో మనకు మృత్తిక (మట్టి) యొక్క ప్రతీతి బలంగానే కలుగుతుంది. అట్లాగే ఈ ప్రపంచాన్ని చూచినప్పుడు ఈ ప్రపంచంలో పరబ్రహ్మమే స్పష్టంగా భాసిస్తుంది.

మనం కుండను చూచినప్పుడు, దానిని పట్టుకొన్నప్పుడు, ఆ కుండకు కారణమైన మట్టి ఆ కుండ ఆకారంలో స్పష్టంగానే కనిపిస్తుంది. ఆ ఘటానికి కారణం మట్టి అనే భావం కలుగుతుంది. అట్లాగే నిత్యమూ మార్పు చెందుతూ అనేక రూపాల్లో కనిపించే ఈ జగత్తును చూచినప్పుడు దానిని గురించి ఆలోచించినప్పుడు ఆ జగత్తుకు మూలంలో కారణభూతంగా, ఏ మార్పూ లేకుండా నిత్యమూ ఉండే ఆ పరబ్రహ్మమే గోచరిస్తుంది.

***సదైవాత్మా విశుద్ధో పి హ్యశుద్ధో భాతివైసదా ।***
***యథైవ ద్వివిధా రజ్జుర్ జ్ఞానినో జ్ఞానినో నిశమ్ ॥*** **68**

ఆత్మ అనేది ఎల్లప్పుడూ విశుద్ధమైనదే ! అయినప్పటికి అది ఎల్లప్పుడు అపవిత్రంగానే కనిపిస్తోంది. ఎందుచేత ? అంటే, త్రాడు అనేది జ్ఞానవంతుడైనవానికి త్రాడుగానే కనిపిస్తుంది. అజ్ఞానికి పాముగానో మరొక విధంగానో కనిపించవచ్చు.

ఆత్మ అనేది ఏ విధమైన వికారంగాని, మలినంగాని, పాపంగాని లేకుండా విశుద్ధంగా ఉన్నప్పటికి, మన ఆజ్ఞానంవల్ల అది వేరు వేరు రూపాల్లో  మలినమైనదిగా, మార్పులు పొందుతూన్నట్లుగా కనిపిస్తుంది. అట్లా కనిపించటానికి కారణం ఆజ్ఞానమే ! భ్రాంతే ! ఈ విషయానికి  దృష్టాంతంగా త్రాడును చెప్పారు.

***యథైవ మృన్మయః కుంభ స్తద్వద్దేహోఽ పి చిన్మయ ః ।***
***ఆత్మానాత్మ విభాగోఽ యం ముధైవ క్రియతేఽ బుధై ః ॥*** **69**

ఘటం మృణ్మయమైనట్లే, ఈ దేహం కూడా చిన్మయమైంది. అజ్ఞానులు అనవసరంగానే ఆత్మానాత్మ విభాగం చేస్తారు.

కుండ మట్టితో కూడి ఉన్నట్లే ఈ దేహం కూడా చేతనతో కూడి ఉంది. కుండ నుండి మట్టినిగాని, శరీరం నుండి చైతన్యాన్నిగాని వేరుచేసి చూడలేము. అట్లా రెంటిని వేరు వేరు ఆస్థిత్వాలు కలవానినిగా- స్వతంత్ర సత్తలనుగా చూడటానికి పూనుకోవటం వ్యర్థం ! అజ్ఞానం కూడాను.

అయితే, ఇట్లా అన్నందువల్ల (ఆత్మానాత్మ విచారణ వ్యర్థం అని అన్నందువల్ల) కొందరు దేహమే ఆత్మ అని అనుకోవచ్చు. కాబట్టి దేహం ఆత్మ కాదు అని 70 నుండి 74 శ్లోకం వరకు చెపుతున్నారు.

## దేహాత్మతా నిషేధం

***సర్పత్వేన యథారజ్జు రజతత్వేన శుక్తికా ।***
***వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా ॥*** **70**

మూఢులైనవారు త్రాడును పాముగానూ, ముత్యపు చిప్పను వెండిగానూ నిశ్చయించుకొన్నట్లే ఆత్మను కూడా దేహరూపంలో నిశ్చయించుకుంటారు- ఆత్మ అంటే దేహమే అనుకుంటారు.

తాడు పాము కాదు. ముత్యపు చిప్ప వెండి కాదు. అట్లాగే ఈ శరీరం ఆత్మ కాదు. మూఢులు మాత్రమే శరీరాన్ని ఆత్మ అని అనుకుంటారు. ఇక్కడ మూఢులు అంటే భౌతిక పదార్థవాదులు - నాస్తికులు. వారు పదార్థాన్నే సత్యంగా భావించి ఆత్మను నిరాకరిస్తారు కాబట్టి!

***ఘటత్వేన యథా పృథ్వీపటత్వేన తన్తవః ।***
***వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా ॥*** **71**

ఘటం రూపంలో మృత్తికను, వస్త్రం రూపంలో దారాలను నిశ్చయించుకొన్నట్లే మూఢులైనవారు దేహరూపంలో ఆత్మను నిశ్చయించుకుంటారు. అంటే, కుండతో మట్టి తయారైందని, వస్త్రంతో నూలు తయారైందని మూడులు మాత్రమే అనుకుంటారు. అట్లాగే ఆత్మ అంటే శరీరమే అని నిశ్చయించేవారు కూడా ఆ విధమైన మూఢులే ! అని భావం.

***కనకం కుండత్వేన తరంగ త్వేన వైజలమ్ ।***

***వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా ॥ 72***

మూఢులు, కుండలముల రూపంలో బంగారిన్న (బంగారం అంటే కుండలం అని) నిశ్చయించుకుంటారు. అలల రూపంలో జలాన్ని (జలం అంటే అలలు) అని నిశ్చయించుకుం టారు. అట్లాగే దేహరూపంలో ఆత్మను నిశ్చయించుకుంటారు. కార్యములైన కుండలము, తరంగములు, దేహములను వాటికి కారణాలైన బంగారం, జలం, ఆత్మలుగా నిర్ణయించుకోవటం మూఢత్వమే గదా !

***చోరత్వేన (పురుషత్వేన) యథా స్థాణుర్జలత్వేన మరీచికా ।***

***వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా ॥ 73***

చోరుని (పురుషుని) రూపాన్ని స్థాణువులోను, జలం యొక్క రూపాన్ని ఎండ మావుల్లోను నిశ్చయించే మూఢులే ఆత్మ స్వరూపాన్ని దేహంలో నిశ్చయించుకుంటారు.

చీకట్లో ఒక చెట్టు మొండెం మనిషిలాగా కనిపంచ వచ్చు. ఎండమావులు నీరులాగా కనిపించవచ్చు. పురుషుడు ఎట్లా ఉంటాడు? అని అడిగితే ఎండిన మ్రానులాగా ఉంటాడని, నీరు ఎట్లా ఉంటుంది? అని అడిగితే ఎండమావుల్లాగా ఉంటుందని చెప్పేవాడు నిజంగా మూఢుడే గదా ! అట్లాగే ఈ శరీరాన్ని చూపి ఇదే ఆత్మ అనేవాడు కూడా మూఢుడే గదా!

***గృహత్వేనైన కాష్ఠాని ఖడ్గత్వేనైన లోహతా ।***

***వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా ॥ 74***

కలపను ఇంటి రూపంలోను, ఖడ్గాన్ని ఇనుము రూపంలోను నిర్ధారించుకొనే మూడులు మాత్రమే దేహాన్ని ఆత్మ రూపంలోనిర్ధారణ చేస్తారు.

కలప ఇల్లు తయారుకావటానికి ఒక అవసరమైన వస్తువే కాని కలపయే ఇల్లు కాదు. అట్లాగే కత్తి తయారు చేయటానికి లోహం ఉపయోగించినా కత్తి మాత్రమే లోహం కాదు. అట్లాగే ఆత్మకు దేహంతోడి సంబంధం ఉన్నా దేహం మాత్రమే ఆత్మ కాదు.

ఇంతవరకు మిథ్యాజ్ఞానాన్ని గురించి, దానివల్ల కలిగే వ్యతిరేక నిర్ణయాల్ని గురించి చెప్పారు. ఈ విధమైన విపర్యయ వృత్తికి కారణమేమిటో ఇక చెప్పబోతున్నారు.

***యథా వృక్ష విపర్యాసో జలాద్భవతి కస్య చిత్ ।***
***తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః ॥*** **75**

ఒకప్పుడు నీరు కారణంగా చెట్టు తలక్రిందుగా ఉన్నట్లు కనబడుతుంది. అట్లాగే మనావుడు అజ్ఞానం కారణంగా ఆత్మలో దేహభావాన్ని పొందున్నాడు.

చెట్టు నీటిలో ప్రతిబింబించినప్పుడు, చెట్టు నీటిలో ఉన్నట్లు తలక్రిందుగా ఉన్నట్లుగా కనిపిస్తుంది. చెట్టు నీటిలో లేదు. ఉన్నట్లుగా మనకు కనిపిస్తుంది అంతే! అట్లా కనిపించటానికి కారణం నీరు; అంతేతప్పచెట్టులో ఏమీ మార్పులేదు. అట్లాగే, అజ్ఞానం కారణంగా మన దేహమే ఆత్మ అనే భ్రాంతి కలుగుతుంది.

మార్పు లేనట్టి, నిత్యము, ఏవిత్రము అయినట్టి, ఆత్మ, అజ్ఞానం కారణంగా ఏ ఏ రూపాల్లో ఎట్లా కనిపిస్తుందో 86వ శ్లోకం వరకు ఉదాహరణలు చూపిస్తున్నారు.

***పోతేన గచ్ఛత ః పుంసః సర్వం భాతీవ చంచలమ్ ।***
***తద్వదా త్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః ॥*** **76**

ఓడమీద ప్రయాణం చేసేవానికి సమస్త పదార్థాలూ నడుస్తూన్నట్లు. కదలుతూన్నట్లు కనిపిస్తాయి. అట్లాగే అజ్ఞానంవల్ల మానవునికి ఆత్మయందు దేహ భావం కలుగుతుంది.

వేగంగా పోతున్న ఓడ, రైలు వగైరా వాహనాలపై ప్రయాణించే వానికి ప్రక్కనున్న చెట్లు చేమలు కదులుతూన్నట్లు కనిపిస్తాయి. యథార్థానికి అవి కదలటంలేదు. తాను పయనిస్తున్న వాహనవేగమే ఆ విధమైన భ్రమ కలగటానికి – అజ్ఞానానికి కారణం. అట్లాగే అజ్ఞానంవల్లనే ఆత్మయందు దేహ భావం కలుగుతోంది.

***పీతత్వం హి యథాశుద్రే దోషాద్భవతి కస్యచిత్ ।***

***తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః ॥*** **77**

నేత్రదోషం (కామెర్ల వగైరా దోషం వల్ల) వల్ల తెల్లని స్వచ్ఛమైన వస్తువులలో కూడా పచ్చదనం కనిపిస్తుంది. అట్లాగే మానవునిలోని అజ్ఞాన దోషం వల్ల ఆత్మయందు దేహభావం కలుగుతోంది– ఆత్మ అంటే దేహంగా కనిపిస్తుంది.

***చక్షుర్భ్యాం భ్రమశీలా భ్యాం సర్వం భాతి భ్రమాత్మకమ్***

***తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగత ః ॥*** **78**

నేత్రరోగం కారణంగా– కండ్లు తిరుగుతున్నవాని కండ్లకు సమస్త వస్తువులు తిరుగుతున్నట్లే కనిపిస్తాయి. భ్రమశీలమైన కండ్లకు అన్నీ భ్రమాత్మకంగానే కనిపిస్తాయి. అట్లాగే అజ్ఞాన దోషం వల్ల మానవునికి ఆత్మ అంటే దేహమే అనే భావం కలుగుతోంది.

***అలాతం భ్రమణేనైవ వర్తులం భాతి సూర్యవత్ ।***

***తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగత ః ॥*** **79**

మండుతున్న కట్టెను మనం త్రిప్పటంవల్ల గుండ్రంగా సూర్యుని లాగా మనకు కనిపిస్తుంది. అంతేగాని అది సూర్యుడు కాజాలదు. దానిని గుండ్రంగా త్రిప్పటంవల్ల మనకు ఆ విధమైన ప్రతీతి కలుగుతోంది. అంతే ! అట్లాగే అజ్ఞానం వల్ల ఆత్మ అంటే దేహంలాగానే బుద్ధికి తోస్తుంది.

***మహత్త్వే సర్వవస్తూనా మణుత్వం హ్యతిదూరతః ।***

***తద్వదా త్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః ॥*** **80**

ఎంత పెద్ద వస్తువులైనా దూరం నుండి చూడటంవల్ల చాలా చిన్నవిగా కనిపిస్తాయి. అట్లాగే అజ్ఞానంవల్ల మానవుడు ఆత్మను దేహ భావంతో చూస్తున్నాడు.

***సూక్ష్మత్వే సర్వవస్తూనాం స్థూలత్వం చోపనేత్రతః ।***

***తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగత ః ॥*** **81**

భూతద్దం– సూక్ష్మదర్శినిలో నుండి చూడటంవల్ల చాలా చిన్నవైన వస్తువులు కూడా చాలా పెద్దవిగా కనిపిస్తాయి. అట్లాగే ఆజ్ఞానంతో చూడటంవల్ల ఆత్మలో దేహభావం కనిపిస్తోంది.

*కాచ భూమౌ జలత్వం వా జల భూమౌ హి కాచతా ।*

*తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగత ః ॥* **82**

నున్నగా అద్దంలాగా చేయబడిన నేల యొక్క ఉపరిభాగం లేదా అద్దంపై భాగం చూచినప్పుడు అక్కడ నీరు ఉన్నట్లు కనిపిస్తుంది. అట్లాగే కదలకుండా, స్వచ్ఛంగా ఉన్న నీటిపై భాగం అద్దంలాగా కనిపిస్తుంది. నీరు అద్దంలాగా,అద్దం నీరులాగా కనిపించటానికి కారణం భ్రమ. అట్లాగే ఆజ్ఞానంవల్ల ఆత్మయందు దేహ భావం కలుగుతోంది.

*యద్వ దగ్నౌ మణిత్వం హి మణౌవా వహ్నితా పుమాన్ ।*

*తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగత ః ॥* **83**

మానవుడు నిప్పుకణాన్ని చూచి మణి అనే భ్రమను పొందవచ్చు. అట్లాగే మణిని చూచి నిప్పుకణం అని భ్రమించవచ్చు. ఆ విధంగానే ఆజ్ఞానంతో కూడి ఉన్నందున ఆత్మనే దేహంగా భ్రమిస్తున్నాడు.

*అభ్రేష సత్సు ధావత్సు సోమో దావతి భాతివై ।*

*తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః ॥* **84**

మేఘాలు ఆకాశంలో పరుగెత్తుతున్నప్పుడు, మనకు చంద్రుడు పరుగెత్తుతూ ఉన్నట్లుగా కనిపిస్తుంది. అట్లా చంద్రుడు పరుగెత్తుతున్నాడని అనుకోవటం భ్రమ, అట్లాగే అజ్ఞానంవల్ల ఆత్మయందు దేహ భ్రాంతి కలుగుతుంది.

*యథైవ దిగ్విపర్యాసో మోహాద్భవతి కస్యచిత్ ।*

*తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః ॥* **85**

ఒక్కొక్కప్పుడు మోహం వల్ల ద్రిగ్భమ కలుగుతుంది. అంటే సామాన్యంగా క్రొత్తచోటుకు వెళ్ళినపుడు, రాత్రివేళలందు ఇటువంటి దిగ్భ్రమ కలుగుతుంది. అంటే ఒక దిక్కును

వేరొక దిక్కుగా భ్రమిస్తాము. అట్లాగే అజ్ఞానం కారణంగా ఆత్మ అంటే దేహం అనే భ్రమ కలుగుతుంది.

***యథా శశీ జలేభాతి చంచలత్వే న కస్యచిత్ ।***
***తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః ॥*** **86**

జలంలో చంద్రుడు ప్రతిబింబించినపుడు ఆ నీటి కదలిక వల్ల చంద్రుడు కదలుతూ ఉన్నట్లు కనిపిస్తుంది- చంద్రుడు ఆకాశంలో స్థిరంగా ఉన్నా, కదిలేది నీరే అయినా చంద్రుడు కదులుతున్నాడని అనుకోవటం భ్రమ. అట్లాగే అజ్ఞానంవల్ల ఆత్మయందు దేమత్వభ్రాంతి కలుగుతోంది.

ఇంతవరకు చెప్పబడ్డ ఆ భ్రాంతి జ్ఞానం ద్వారా మాత్రమే తొలగుతుందని చెవుతున్నారు.

***ఏవ మాత్మన్య విద్యాతో దేహాధ్యాసో హి జాయతే ।***
***స ఏవాత్మా పరిజ్ఞాతో లీయ తేచ పరాత్మని ॥*** **87**

ఆవిద్య (అజ్ఞానం) కారణంగా ఈ విధంగా ఆత్మ యందు దేహాధ్యాసం కలుగుతోంది. ఆత్మ అంటే దేహమే అనే భ్రమ కలుగుతోంది. జ్ఞానం కలగటంతోనే ఆ ఆత్మయే పరమాత్మ యందు లీనమైపోతుంది- అంటే, ఆత్మవేరు, పరమాత్మవేరు అనేభావం తొలిగిపోతుంది. అప్పుడిక మిగిలేది ఆ పరమాత్మే !

ఆత్మ అనేది ఒక పదార్థం కాదని తెలుస్తుంది. వస్తువు అనేది మానసికంగా పుట్టేది. దానికి ఎప్పుడూ నాశనం ఉంటుంది. ఆత్మ అటువంటిది కాదు; అది నిత్యము అనే జ్ఞానం కలగటంతోనే ఒక భ్రమలనేని ఏమీ ఉండవు.

***సర్వ మాత్మతయా జ్ఞాతం జగత్ స్థావర జంగమమ్ ।***
***అభావాత్సర్వ భావానాం దేహానాం చాత్మతా కుతః ॥*** **88**

ఈ స్థావర జంగమాత్మకమైన జగత్తు అంతా ఆత్మ స్వరూపమే అని తెలుసుకోవటంతోటే సమస్త భావాలూ లయమైపోతాయి. ఇక అటువంటి స్థితిలో – ఏ భావమూ, ఏ మానసిక ప్రక్రియా పని చేయాని స్థితిలో- ఈ దేహమే ఆత్మ అనే భావం ఎక్కడ ఉంటుంది? ఇక ఆ విధమైన విధ్యా జ్ఞానం ఉండదని భావం.

అజ్ఞానం ఉన్నంతవరకే మనిషి ఆత్మలో దేహభావాన్ని చూస్తాడు. జ్ఞానోదయం కాగానే సమస్త భేదభావాలూ కరగిపోయి జగత్తులో ఉన్న కదిలేవి కదలనివి అయిన జీవరాసులు, చెట్లు చేమలు సమస్తము ఆత్మ స్వరూపమే అయి. ఆ అద్వితీయమైన ఆత్మ మాత్రమే మిగులుతుంది. ఇక ఆ స్థితిలో శరీరం అఏది ఉండనే ఉండదు. ఇక అటువంటప్పుడు శరీరాన్ని ఆత్మగా భావించే అవకాశమూ ఉండదు.

***ఆత్మానం సతతం జానన్ కాలం నయ మహామతే ।***

***ప్రారబ్ధ మఖిలం భుంజన్నో ద్వేగం కర్తుమర్హసి ॥*** ***89***

ఓమహా జ్యోతిస్వరూపుడా ! ఓ మహాజ్ఞానీ ! ఈ విధంగా ఆత్మ స్వరూపాన్ని నిరంతరం ధ్యానిస్తూ నీ ప్రారబ్ధాన్ని అంతటినీ అనుభవిస్తూ కాలం గడుపు ! ఈ జీవితాన్ని గడుపు ! ఉద్విగ్నుడవు కావద్దు. దుఃఖించవద్దు. ప్రారబద్ధకర్మానుభవానికి బాధపడటంగాని, దుఃఖించటంగాని అనవసరం. ఎందుచేత? ఆ కర్మానుభవం తప్పనిసరి కాబట్టి !

కర్మలు మూడు రకాలుగా ఉంటాయి అని కర్మ సిద్ధాంతం –

**1) క్రియమాణ కర్మ :** ఈ జన్మలో మనం చేస్తూ ఉన్న కర్మలు.

**2) సంచిత కర్మ :** వెనుకటి జన్మలలో మనం చేసిన కర్మలు. ఈ సంచిత కర్మలే భవిష్యత్తులో మనకు అనేక జన్మలను ఇచ్చేటందుకు కారణమౌతాయి.

**3) ప్రారబ్ధకర్మలు :** మనం వెనుక జన్మలలో చేసుకొన్న కర్మల వల్ల, ఈ జన్మ మనకు లభించటానికి కారణమైన కర్మలే ప్రారబ్ధ కర్మలు. సంచిత కర్మలకు ప్రారబ్ధ కర్మలకు ఉన్న భేదం ఏమిటంటే– సంచిత కర్మల ఫలం ఇంకా ప్రారంభం అయి ఉండదు. అట్లా ప్రారంభమై ఉంటే అవి ప్రారబ్ధ కర్మలే అవుతాయి. ఈ ప్రారబ్ధకర్మలే కాక, సంచిత కర్మలనేవి ఇంకా చాలా (ప్రారంభం కాకుండా) ఉంటాయన్న మాట. క్రియమాణ కర్మలు, సంచిత కర్మలై సంచిత కర్మలు ప్రారబ్ధ కర్మలౌతూం టాయని తెలుస్తోంది. ఈ విధంగా కర్మచక్ర పరిభ్రమణం సాగుతూనే ఉంటుంది. దీని నుండి తప్పించుకోవాలంటే జ్ఞానమే శరణ్యం !

ఇక ఇప్పుడు ప్రారబ్ధ కర్మ నిరాకరణాన్ని గురించి చెపుతున్నారు.

# ప్రారబ్ధ నిరాకరణం

***ఉత్పన్నేఽ ప్యాత్మ విజ్ఞానే ప్రారబ్ధం నైన ముంచతి ,***
***ఇతి యచ్ఛ్రూయతే శాస్త్రే తన్ని రాక్రియతేఽ ధునా ॥*** **90**

"ఆత్మ జ్ఞానం కలిగినప్పటికి ప్రారబ్ధం వదలదు" అని శ్రుతుల్లో శాస్త్రాల్లో ఉన్న విషయం ఇప్పుడు నిరాకరింపబడుతోంది. చాలా చోట్ల శాస్త్రాల్లో "జ్ఞానియైనవాడు కూడా ప్రారబ్ధాన్ని అనుభవింపక తప్పదు– ప్రారబ్ధం ఇంకా అతనిని బంధించే ఉంచుతుంది" అని చెప్పబడ్డది. ఛాందోగ్యోపనిషత్తు 6వ అ. 14 ఖం. 2 మంలో "...ఏవమే వేహాచార్య వాన్ పురుషో వేద తస్య తావదేవ చిరంయావన్న విమోక్ష్యే థ సంపత్స్య ఇతి"– జ్ఞానియైన వాడు కూడా శరీరం ఉన్నంతవరకు ప్రారబ్ధం అనుభవించాలని, శరీర త్యాగం తరువాత మోక్షాన్ని పొందుతాడని చెప్పబడ్డది. ఈ విషయమై శ్రీ ఆదిశకంరులు తమ అభిప్రాయాన్ని – అంటే, ప్రారబ్ధ కర్మ అనేది జ్ఞానిని బంధించి ఉంచదు అనే విషయాన్ని– స్పష్టంగా చెపుతున్నారు. జ్ఞానియైన వాని దృష్టిలో శరీరమనేది ఏదీ ఉండనే ఉండదు. అటువంటప్పుడు, శరీరమేలేని ఆత్మ, ప్రారబ్ధానికి లోబడి ఉంటుందని అనటంలో అర్థం లేదు, కాకపోతే, చూచేవాళ్ళు మాత్రం, శరీరపాతం జరిగేటంతవరకు జ్ఞాని కూడా ప్రారబ్ధాన్ని అనుభవిసున్నాడని అనుకోవచ్చు. ఈ విషయాన్ని సమర్థించటానికే 91, 92 శ్లోకాలు చెప్పబడుతున్నాయి.

***తత్త్వ జ్ఞానోదయాదూర్ధ్వం ప్రారబ్ధం నైవ విద్యతే ।***
***దేహా దీనా మసత్య త్వా ద్యథా స్వప్నో విబోధతః ॥*** **91**

మేల్కొన్న తరువాత స్వప్నం ఉండనట్లే, దేమాదులు, అసత్యమైనందువల్ల జ్ఞానోదయం అయిన తరువాత ప్రారబ్ధమనేది ఉండదు.

స్వప్నస్థితిలో మనం అనేక విషయాలు చూస్తున్నాం; అనుభవిస్తున్నాం. కాని, అవన్నీ మనం మేల్కొనటంతోనే ఉండటంలేదు. అట్లాగే జ్ఞానోదయం కలిగేటంతవరకు మనం చూచినవి, అనుభవించినవి అయిన ప్రారబ్ధకర్మ పరంసరలు జ్ఞానోదయం కాగానే

మాయమైపోతాయి. అంటే, ఇక ప్రారబ్ధమనేది ఉండదు– జ్ఞానోదయం కలిగేటంతవరకే ఈ శరీరం. మనస్సు, బుద్ధి. ఇంద్రియాలు ఉంటాయి. వీటి చర్యలు ఉంటాయి. ఆ చర్యల ఫలాన్ని అనుభవించటం ఉంటుంది. జ్ఞానోదయం కాగానే అవన్నీ లయమైపోతాయి కాబట్టి జ్ఞానానికి ఇక మిగిలే ప్రారబ్ధమంటూ ఏదీ ఉండదు. శరీరాదులు లేనప్పుడు ప్రారబ్దానికి ఇక ఆస్తిత్వమే ఉండదు– శరీరం లేనప్పుడు ప్రారబ్ధం తన ప్రభావాన్ని చూపలేదు.

***కర్మ జన్మాంతర కృతం ప్రారబ్ధ మితి కీర్తితమ్ ।***

***తత్తు జన్మాంతరాభావాత్పుం పో నైనా స్తి కర్హి చిత్ ॥*** **92**

జన్మాంతరాల్లో చేసిన కర్మనే ప్రారబ్ధమంటారు. కాబట్టి జ్ఞాని దృష్టిలో జన్మాంతరమనేది లేదు కాబట్టి అతడు ఏ స్థితిలోనూ లేనట్లే !

లోగడ జన్మల్లో మనం చేసుకొన్న ఏ కర్మల వల్ల మనకు ఈ శరీరం జన్మ లభించిందో ఆ కర్మల్ని ప్రారబ్ధ కర్మలంటారు. జ్ఞాని దృష్టిలో జన్మాంతరాలనేవి ఏవీ ఉండవు– అతడు ముక్తుడు కాబట్టి ! అతడు ఏ స్థితిలోను, ఏ అవస్థలోను ఉన్నవాడు కాడు. అంటే జ్ఞానికి ప్రారబ్ధమనేది ఉండదని, ప్రారబ్ధం ఉండదు కాబట్టి భవిష్యత్తులో మరొక జన్మంటూ ఉండదని భావం.

***స్వప్న దేహో యథాధ్యస్త స్తథై వాయం హి దేహక ః ।***

***అధ్యస్తస్యకుతో జన్మ జన్మాభావే హి తత్కుతః ॥*** **93**

స్వప్నంలోని శరీరం అధ్యస్తం– మిధ్య. అట్లాగే ఈ జాగ్రదవస్థలోని శరీరం కూడా అధ్యస్తమే ! మిధ్య, భ్రాంతివల్ల కలిగే వాటికి పుట్టుక అంటూ ఎట్లా ఉంటుంది ! పుట్టుక అంటూ లేనప్పుడు ప్రారబ్ధం మాత్రం ఎక్కడి నుండి వస్తుంది?

అధ్యాసము అంటే జగద్గురువుల మాటల్లో– 'అధ్యా సోనామ అతస్మిఇన్ తుద్బుద్ధిః ' అంటే– తత్పదార్థంలో తద్భిన్న పదార్థాన్ని ఆరోపించటం– ఒక వస్తువులో దానికి భిన్నమైన వస్తువును ఆరోపించటం. ఉదా॥ కొడుకుగాని, భార్యగాని, సన్మానింపబడినప్పుడు మానవుడు తానే ఆ గౌరవం పొందినట్లు తలుస్తున్నాడు. అంటే ఇతరుల ధర్మాన్ని– భార్య, పుత్రుల సంతోషమనే ధర్మాన్ని –తనలో ఆరోపించుకుంటున్నాడు. అట్లాగే ఒకడు తన్ను తాను

కుంటివానిగా, గ్రుడ్డివానిగా తలచుకుంటాడు. అంటే అతడు తనలో అభ్యంతర ధర్మాల్ని ఆరోపించుకుంటున్నాడు. ఇదంతా అధ్యాసం. అధ్యాసం అనేది అజ్ఞానంవల్ల మరీ విజృంభిస్తుంది.

***ఉపాదానం ప్రపంచస్య మృద్భాండస్యేవ కథ్యతే।***
***అజ్ఞానంచైవ వేదాన్తైస్తస్మిన్నష్టే క్వ విశ్వతా॥*** **94**

కుండకు ఉపాదాన కారణం మట్టి లాగానే అజ్ఞానమనేది ఈ ప్రపంచానికి ఉపాదాన కారణం అని వేదాంత గ్రంథాలలో చెప్పబడ్డది. జ్ఞానంతో మనం ఆ అజ్ఞానాన్ని నాశనం చేసినప్పుడు ఇంకా ఈ జగత్తు అనేది ఎక్కడ ఉంటుంది? ఉండేదేదో ఇక పరబ్రహ్మమే అని భావం.

శ్వేతాశ్వతరోపనిషత్తు 4వ అ. 10 మంత్రంలో– "మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరం" జగత్కారణమైన ప్రకృతిని మాయగా (అజ్ఞానంగా అని) తెలుసుకో ! మహేశ్వరుని మాయానిగా (మాయ చేసేవాడు) గుర్తించు" అని చెప్పారు. కాబట్టి జ్ఞానంతో అజ్ఞానాన్ని తొలగించి వేస్తే ఇక ఈ ప్రపంచం అనేది ఉండదు. గుడ్డలో ఉండే దారపు పోగుల్ని భస్మం చేస్తే ఒక వస్త్రం ఎక్కడుంటుంది మట్టిని నాశనం చేసేస్తే ఇంకా కుండ ఎక్కడుంటుంది?

***యథా రజ్జుం పరిత్యజ్య సర్పం గృహ్ణాతి వైభ్రమాత్।***
***తద్వ త్సత్యమవిజ్ఞాయ జగత్పశ్యతి మూఢధీః॥*** **95**

భ్రమకులోనై యథార్థమైనట్టి త్రాటికి బదులుగా సర్పాన్ని చూస్తున్నట్లే సత్యాన్ని గుర్తించలేని మూఢుడు (అజ్ఞాని) ఈ ప్రపంచాన్ని చూస్తున్నాడు. అంటే, ప్రపంచం ఈ విధంగా నామరూపాల్లో కనిపించటానికి కారణం అజ్ఞానమే అని భావం.

***రజ్జు రూపే పరిజ్ఞాతే సర్పభ్రాంతిర్న తిష్ఠతి।***
***అధిష్ఠానే తథా జ్ఞాతే ప్రపంచః శూన్యతాం వ్రజేత్॥*** **96**

త్రాటి యొక్క యథార్థ స్వరూపం తెలియగానే పాము అనే భ్రమ తొలగిపోతుంది. అట్లాగే జగదధిష్ఠాతయైన పరబ్రహ్మను తెలుసుకోగానే అజ్ఞానంవల్ల పుట్టిన ఈ ప్రపంచం

శూన్యరూపమై పోతుంది. రూపం లేకుండా పోతుంది. నామరూపాలన్నీ కరిగిపోతాయి. ఈ జగత్తుకు మూలమైన సత్యాన్ని గుర్తించగానే జగత్తు ఇక ఈ రూపంలో కనిపించదు. సమస్తమూ బ్రహ్మమయంగానే భాసిస్తుంది.

*దేహస్యాపి ప్రపంచ త్వా త్ప్రారబ్ధానస్థితిః కుతః ।*
*అజ్ఞాని జన బోధార్థం ప్రారబ్ధం వక్తి వై శ్రుతిః ॥* **97**

ఈ పైన చెప్పిన విషయాలన్నీ గ్రహిస్తే- నామ రూపాత్మకమైనట్టి ఈ ప్రపంచం అంతా ఆజ్ఞానంవల్ల పుట్టిందనే సత్యాన్ని గుర్తిస్తే ఇక ఈ శరీరం కూడా ఈ ప్రపంచంలో ఒక భాగమైనందువల్ల ఇది కూడా ఆసత్యమే అవుతుంది. అటువంటప్పుడు ఇంకా ప్రారబ్ధమనేది ఏమి ఉంటుంది? ఆజ్ఞానులైనవారికి తెలియజెప్పటం కోసమే శ్రుతులు ఈ ప్రారబ్ధాన్ని గూర్చి చెపుతున్నాయే తప్ప వేరు కాదు. జ్ఞానంవల్ల ఆజ్ఞాన జన్యమైన ఈ ప్రపంచ స్వరూపాన్ని గుర్తించలేని ఆజ్ఞానులకు జ్ఞానం పొందిన పిమ్మట కూడా శరీరంతో ఉండే జ్ఞానుల ప్రవర్తనను గురించి చెప్పటానికై తాత్కాలికమైన ఈ ప్రారబ్ధాన్ని గురించి చెప్పారు. అంతే తప్ప జ్ఞానుల విషయంలో ప్రారబ్ధమనేది ఉండదు.

*క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ।*
*బహుత్వం తన్నిషేధార్థం శ్రుత్యా గీతం చ యత్స్ఫుటమ్॥* **98**

"భిద్యతే హృదయ గ్రంధిశ్ఛిద్యన్తే సర్వసంశయాః । క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే " 'ముం॥ ఉ॥ 2 ము. 2. ఖం 8 మం) "కారణ రూపంలో పరుడుగాను, కార్యరూపంలో అపరుడుగాను ఉండే ఆ పరమాత్మ యొక్క సాక్షాత్కారం కాగానే ఆత్మానాత్మ అధ్యాసరూపమైన (ఆత్మను అనాత్మగా భావించటం అనే) హృదయ గ్రంథి తెగిపోతుంది. జ్ఞేయ విషయంలో ఉండే సందేహాలన్నీ నష్టమైపోతాయి. సమస్త కర్మలు క్షయమైపోతాయి" అని శ్రుతి చెప్పింది గదా! ఈ విధంగా చెప్పిబడిన శ్రుతి వాక్యంలో ప్రారబ్ధాన్ని నిషేధించటం కోసమే "కర్మాణి" అని బహువచన ప్రయోగం చేయబడ్డది- సమస్త కర్మలు అని. అంటే జ్ఞానోదయం కాగానే సంచిత క్రియమాణ కర్మలతో బాటు ప్రారబ్ధ కర్మలు కూడా క్షయమైపోతాయి అని చెప్పటానికే బహువచన ప్రయోగం చేయబడ్డది. కారణమైనట్టి ఆజ్ఞానం నశించటంతోనే, ఆ ఆజ్ఞానానికి కార్యమైనట్టి ప్రారబ్ధం కూడా నశిస్తుంది. ఇది సహజం.

*ఉచ్చతేఽ జ్ఞై ర్బలాచ్చైతత్తదాన ర్థద్వయాగమః ।*
*వేదాన్త మతహానం చ యతో జ్ఞానమితి శ్రుతిః ॥* **99**

ఆజ్ఞానులైన వారు బలాత్కారంగా జ్ఞానికి ప్రారబ్ధం ఉందని గనుక ప్రతిపాదిస్తే దానివల్ల రెండు అనర్థాలు సిద్ధిస్తాయి–

1) మోక్షాభావము– మోక్షమనేది లేకపోవటం 2) జ్ఞాన సంప్రదాయానికి భంగము. అంతేకాక, అద్వైత వేదాంత సిద్ధాంతానికి కూడా హాని కలుగుతుంది. అందుచేత జ్ఞానికి ప్రారబ్ధాన్ని ప్రతిపాదించే వ్యావహారిక ద్వైత శ్రుతులను వదలివేసి, ఏ శ్రుతులవల్ల సత్యమైన జ్ఞానం కలుగుతుందో అటువంటి ఆ శ్రుతులనే గ్రహించాలి. అంటే ప్రారబ్ధాన్ని ప్రతిపాదించే ద్వైతశ్రుతులను వదలి, అద్వైతభావాన్ని ప్రతిపాదించే శ్రుతులనే గ్రహించాలి అని భావం.

ఇంతవరకు ప్రాబద్ధనిరాకరణం చెప్పారు. తరువాత జ్ఞాన ప్రాప్తికి అవసరమైనట్టి నిది ధ్యాసాదులకు సంబంధించిన 15 అంగాలను చెపుతున్నారు.

## నిది ధ్యాసనానికి అంగాలు

*త్రిపంచాంగాన్యథోవక్ష్యే పూర్వోక్తస్య హి లబ్ధయే ।*
*తైశ్చ సర్వైః సదా కార్యం విదిధ్యాసన మేవతు ॥* **100**

ఇంతకు పూర్వం చెప్పబడిన జ్ఞాన నిష్ఠను పొందటానికి అవసరమైన 15 అంశాలను చెపుతున్నారు. ఆ 15 అంశాల సహాయంతో నిది ధ్యాసనం అభ్యాసం చేయాలి.

వెనుక 24 నుండి 28 శ్లోకం వరకు జ్ఞాన స్వరూపాన్ని వర్ణించారు. ఆ విధమైన జ్ఞానాన్ని పొందటం ఎట్లా? దానికిగాను 15 రకాల సాధనాలను చెపుతున్నారు. వాటిని ఆధారంగా గ్రహించి అభ్యాసం చేస్తే జ్ఞాన ప్రాప్తి కలుగుతుందని చెపుతున్నారు. జ్ఞానప్రాప్తి మన లక్ష్యం. ఈ చెప్పబోయేదంతా ఆ లక్ష్యసాధనకు కావలసిన అభ్యాసక్రమం.

*నిత్యాభ్యాసాదృతే ప్రాప్తిర్న భవేత్సచ్చిదాత్మనః ।*

*తస్మాద్బ్రహ్మ నిదిధ్యాసే జ్జిజ్ఞాసుః శ్రేయసే చిరమ్ ॥* **101**

నిరంతరం అభ్యాసం చేస్తే తప్ప సత్‌చిత్ స్వరూపమైన ఆత్మ ప్రాప్తి కలుగదు. కాబట్టి జిజ్ఞాసువు అయినవాడు తన శ్రేయస్సు కోసం చాలా కాలం పాటు బ్రహ్మచింతనం చేయాలి. అంటే, బ్రహ్మను గూర్చిన ధ్యానం చేయాలి. బ్రహ్మజ్ఞానమనేది సులభంగా ఒక రోజులో కలిగేది కాదు. నిరంతరం విఘ్నాలకు, కష్టాలకు వెనుదీయకుండా సాధన చేయాల్సిందే ! నిరుత్సాహం పనికిరాదు. పట్టుదల –ఎడరాదు. ఇది జిజ్ఞాసువుల లక్షణం.

*యమో హి నియమస్త్యాగో మౌనం దేశశ్చ కాలతః ।*

*ఆసనం మూలబంధశ్చ దేహ సామ్యం చ దృక్ స్థితి ః ॥* **102**

*ప్రాణ సంయమనం చైవ త్ర్యాహారశ్చ ధారణా ।*

*ఆత్మధ్యానం సమాధిశ్చ ప్రోక్తాన్యంగాని వైక్రమాత్ ॥* **103**

యమము, నియమము, త్యాగము, మౌనము, దేశము, కాలము, ఆసనము, మూలబంధము, దేహసమత్వం, నేత్రస్థితి, ప్రాణాయామం, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి అనే ఈ 15 సూత్రాలు క్రమంగా అబ్యాసానికి– నిదిధ్యాసానికి అంగాలుగా చెప్పబడ్డాయి.

ఇక వరుసగా వీటిని గురించి వివరంగా చెపుతున్నారు. వీటిని గురించి అనేక వేదాంత గ్రంథాలతో, యోగశాస్త్ర గ్రంథాలలో కూడా చెప్పబడి ఉంది.

*సర్వం బ్రహ్మేతి విజ్ఞానా దింద్రియ గ్రామ సంయమః ।*

*యమోఽ య మితి సంప్రోక్తోఽ భ్యసనీయో ముహుర్ముహు ః ॥* **104**

'ఈ సమస్తమూ బ్రహ్మమే' అనే జ్ఞానంతో ఇంద్రియాలను వశపరచుకోవటాన్ని 'యమము' అంటారు ఈ విధమైన యమాన్ని– ఇంద్రియ నిగ్రహాన్ని– నిరంతరం అభ్యాసం చేయాలి.

ఈ యమాన్ని, గురించి పాతంజల యోగదర్శనం 2వ పాదం 30వ సూత్రంలో చెప్పారు– "అహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యా పరిగ్రహాయమాః" అని. అహింస, సత్యము, ఆస్తేయము (దొంగతనం చేయకుండా ఉండటం) బ్రహ్మచర్యం, అపరిగ్రహం (స్వార్థానికై సంపద ప్రోగుచేయకుండా ఉండటం) ఇవన్నీయమము క్రిందికే వస్తాయి. సమస్తము బ్రహ్మమే– సర్వం ఖల్విదం బ్రహ్మ– అని తెలుసుకుంటే ఈ పై లక్షణాలన్నీ తమంతట అనే అబ్బుతాయి.

***సజాతీయ ప్రవాహశ్చ విజాతీయ తిరస్కృతిః ।***
***నియమోహి పరానన్దో నియమాత్ క్రియతే బుధైః ॥*** **105**

సజాతీయమైన వృత్తుల్ని (భావాల్ని) ప్రవహింపచేస్తూ విజాతీయ భావాలను తిరస్కరిస్తూ ఉండటమే పరమానంద స్వరూపమైన నియమం. బుద్ధిమంతులు ఈ నియమాన్ని తప్ప కుండా పాలిస్తూ ఉంటారు.

ఆత్మ, పరమాత్మ ఇవి సజాతీయాలు. ఆత్మకు పరమత్మ సజాతీయం. ఆత్మకు శరీరము, ప్రపంచము ఇవన్నీ విజాతీయాలు కాబట్టి విజాతీయమైన వాటినన్నింటినీ దూరంగా నెట్టివేస్తూ సజాతీయమైన బ్రహ్మయందే లీనమై యుండాలి. ఈ నియమాన్ని పతంజలి మహర్షి ఇట్లా నిర్వచించారు. "శౌచ సంతోష తపః స్వాధ్యేయేశ్వర ప్రణిధానాని నియమాః" 2వ అ. 32సూ. "శుచిగా ఉండటం. సంతోషంగా ఉండటం, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర శరణాగతి అనేవి నియమాలు" అని.

సజాతీయ వృత్తుల్ని ప్రవహింపజేయటం అంటే– 'అహం బ్రహ్మాస్మి, సోఽహం', నేనే బ్రహ్మను. ఆ బ్రహ్మను నేనే అని నిరంతరం భావిస్తూ ఉండటం. ఈ విధంగా బ్రహ్మ యందు చరించేవానికి పైన చెప్పిన శౌచసంతోషాధి లక్షణాలన్నీ తేలికగా వాటంతట అవే వస్తాయి.

***త్యాగః ప్రపంచ రూపస్య చిదాత్మ త్వాలోకనాత్ ।***
***త్యాగోహి మహతాం పూజ్యః సద్యో మోక్షమయోయతః॥*** **106**

ఈ ప్రపంచమంతటిని చిదాత్మ స్వరూపంగా చూస్తే ఆ ప్రపంచం యొక్క భ్రమాత్మకమైన రూపాన్ని వదలివేయటమే (త్యజించడమే) మహనీయులైన వారు చేసే గొప్ప త్యాగం. అదే శీఘ్రంగా మోక్షాన్ని కలిగిస్తుంది.

ఈ త్యాగమనేదానికి– సమస్త కర్మలను త్యజించటం అని, స్వార్థాన్ని త్యజించటం అని, ఆ విధంగా నైష్కర్మ్యస్థితిని పొందటం అని– నిర్వచనాలు ఇచ్చారు. సమస్తాన్ని ఆత్మగానే భావించేవానికి కోరదగింది ఏమీ ఉండదు. ఈ ప్రపంచం యొక్క భ్రాంతిజనకమైన రూపాన్ని త్యజించటమే నిజమైన త్యాగం అని ఇక్కడ చెప్పారు– నామరూపాత్మకమైన ప్రాపంచిక విషయ పరిత్యాగం అన్నమాట. ఈశావాశోయపనిషత్తు 1వ మంత్రంలో "ఈ జగత్తు– అంతా పరమాత్మ చేత ఆవరింపబడ్డదే! ఈ సత్యం తెలుసుకుంటే మిథ్య అయిన జగత్తు తొలగిపోతుంది" అని చెప్పబడ్డది.

***యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ ।***

***యన్మౌనం యోగిభిర్గమ్యం తద్భజేత్సర్వదా బుధః ॥*** **107**

తైత్తిరీయోపనిషత్తులోని ఆనందవల్లి తొమ్మిదవ అనువాక వాక్యంతో ఈ శ్లోకం ఆరంభించారు. మౌనలక్షణం చెపుతున్నారు.

ఎవనిని పొందలేక మనస్సుతో పాటు వాక్కు కూడా వెనుదిరిగి వస్తోందో, ఏ మౌనం వరకు యోగులైనవారు మాత్రమే, చేరగలుగుతారో అటువంటి మౌనాన్ని విద్యాంసుడైనవాడు ధారణ చేయాలి– ఆ మౌనాన్ని పాటించాలి. ఆత్మను పొందలేక మనస్సు, వాక్కు వెనుదిరిగి వస్తున్నాయి. ఆ ఆత్మను యోగి మాత్రమే చేరగలుగుతాడు. మనస్సు, వాక్కు చేరలేని ఆ మౌనాన్ని పాటించాలి. ఇక్కడ మౌనము అంటే ఆత్మ అనే భావం– అదే యోగులు పొందవలసింది. ఆత్మ ఆనేది మనస్సుకు, వాక్కుకు అందనిది. ఈ విషయాన్నే వివరిస్తున్నారు.

***వాచో యస్మాన్ని వర్తన్తే తద్వక్తుం కేన శక్యతే ।***

***ప్రపంచో యది వక్తవ్యః సోఽపి శబ్దవివర్జితః ॥*** **108**

మాటలకు కూడా చేరటానికి శక్యంకాని ఆ పరబ్రహ్మాన్ని ఎవరు ఏమని వర్ణించగలరు? పోనీ శబ్దానికి విషయంగా ఈ ప్రపంచాన్నే అంగీకరించి వర్ణిద్దామంటే ఆది కూడా శబ్ద రహితమే ! కాబట్టి బ్రహ్మను వర్ణించే విషయంలో మౌనమే శరణ్యం. ఈ ప్రపంచాన్ని సత్ అనీ అనలేదము. ఆసత్ అనీ అనలేము. సత్‌గాని, అసత్‌గాని అయిన వస్తునే శబ్దానికి విషయమౌతుంది. ఈ ప్రపంచం జ్ఞాన సమయంలో మరుగైపోతుంది కాబట్టి. దీనిని సత్

పదార్థం అనలేము. అజ్ఞానస్థితిలో ప్రతీతమౌతుంది కాబట్టి అసత్ అనీ అనలేము. అది సత్పదార్థమైతే సుషుప్తిలో లయం కాకుండా ఉండాలి. అది అసత్పదార్థమైతే జాగ్రదవస్థలో కనిపించకూడదు. కాబట్టి ఈ ప్రపంచమనేది కూడా అనిర్వచనీయమైనదే ! వాక్కుతో చెప్పటానికి వీలు కానిదే ! పైగా, శబ్దము, 'ఆ శబ్దం ద్వారా చెప్పబడే వస్తువు. ఈ రెంటికి గల సంబంధం కూడా కాల్పనికమేగాని వాస్తవికం కాదు. కాబట్టే ఈ ప్రపంచం కూడా శబ్దానికి విషయం కాదని అన్నారు.

***ఇతివా తద్భవేన్మౌనం సతాం సహజ సంజ్ఞితమ్ ।***

***గిరా మౌనం తు బాలానాం ప్రయుక్తం బ్రహ్మవాది భిః॥*** **109**

పరబ్రహ్మము, ప్రపంచము ఈ రెండూ కూడా అనిర్వాచ్యాలే కాబట్టి సత్పురుషులైన వారికి మరొక మౌనం ఇక ఏది? అని ప్రశ్న. అటువంటి యోగులకు స్వాభావికమైన మౌనం అంటే– ఆత్మ నుండి విడదీయరానట్టి ఈ ప్రపంచం యొక్క అశబ్దత్వం అయి ఉండవచ్చు. ఆత్మలీనత కావచ్చు. కేవలం వాక్కు ద్వారా పాటించే మౌనం అజ్ఞానుల కోసం, మూర్ఖుల కోసం చెప్పబడ్డది.

***ఆదానన్తే చ మధ్యే చ జనో యస్మిన్న విద్యతే ।***

***యేనేదం సతతం వ్యాప్తం స దేశో విజనః స్మృతః ॥*** **110**

ఇక దేశము అనే విషయాన్ని గూర్చి– విజన ప్రదేశాన్ని గూర్చి, దేనికి (ఏ ప్రదేశానికి) ఆది, అంతము, మధ్యభాగము అనే వేర్పాటు ఉండదో, దేని ఆది మధ్యాంతాల్లో జనులు ఉండరో, దేనిచేత ఈ జగత్తు నిరంతరము వ్యాప్తమై ఉందో అటువంటి దేశాన్ని విజన ప్రదేశం– జనుశూన్యమైన ప్రదేశం అంటారు. ఆ ఏకాంత విజన ప్రదేశం, రెండవదానికి చోటు లేకుండా ఉండే అద్వితీయ ప్రదేశం ఆ బ్రహ్మమే ! అని భావం.

***కలనా త్సర్వ భూతానాం బ్రహ్మాదీనాం నిమేషతః ।***

***కాలశబ్దేన నిర్దిష్టో హ్యఖండానంద అద్వయః ॥*** **111**

ఆ పరబ్రహ్మను కాలము అని కూడా అంటారు. ఎందుచేత? బ్రహ్మ మొదలుగా గల సమస్త భూతాలను ఒక్క క్షణంలో సృష్టించగలిగినందున (కలనాత్) అద్వితీయుడైన,

అఖండానంద స్వరూపుడైన ఆ పరమాత్మ 'కాలము' అనే శబ్దంతో పిలవబడుతున్నాడు. పరమాత్మ తన మనస్సులో అనుకోవటమే ఈ ప్రపంచ సృష్టి జరగటం అంటే ! మనం మన మనస్సులో తలచుకోగానే స్వప్నం సాక్షాత్కరించినట్లు ! అట్లాగే స్థితిలయాలు కూడాను. ఈ కాలమనేదే పై 15 అంశాలలో ఆరవది. అన్నింటికి క్రొత్త నిర్వచనాలీయటం– ఆత్మపరంగా గమనించతగ్గ విషయం !

***సుఖేనైవ బవే ద్యస్మిన్న జస్రం బ్రహ్మ చింతవమ్ ।***
***ఆసనం తద్విజానీయాన్నేతర త్సుఖనాశనమ్ ॥*** **112**

ఇక ఏడవ అంశమైన ఆసనాన్ని గురించి–

ఏ స్థితిలో, సుఖంగా, నిరంతరం బ్రహ్మచింతన చేయటానికి – బ్రహ్మను గురించిన ధ్యానం చేయటానికి వీలవుతుందో దానినే 'ఆసనము' అని అనాలి. అంతేతప్ప మనకు సుఖాన్ని కలిగించకుండా బాధకలిగించే ఏ స్థితినీ ఆసనం అనటానికి వీలు లేదు. బాధ కలిఇంచే స్థితిలో మనస్సు నిలకడగా ఉండదు కాబట్టి సుఖంగా ఉండే స్థితినే ఆసనం అన్నారు. యోగాసనాల విషయంలో ఉండే సామాన్యాభిప్రాయాన్ని ఈ నిర్వచనంతో పోల్చి చూచకోవటం మంచింది.

***సిద్ధం యత్సర్వ భూతాది విశ్వాధిష్ఠాన మవ్యయమ్ ।***
***యస్మిన్ సిద్ధాః సమావిష్టా స్తద్వై సిద్ధాసనం విదుః ॥*** **113**

ఏది సమస్త భూతాలకు ఆది కారణమైనదో, ఏది ఈ విశ్వానికి అంతకు శాశ్వతమైనట్టి, ఆవ్యయమైనట్టి ఆశ్రయమై ఉన్నదో, దేనియందు సిద్ధజనులు– యోగులు పూర్తిగా లీనమై ఉంటారో అట్టివానినే (పరబ్రహ్మన్నే) సిద్ధాసనం అని అంటారు. సిద్ధాసనం అనేది యోగాసనాల్లోనిది కాకుండా ఇక్కడ పరబ్రహ్మనే సిద్ధాసనంగా చెపుతున్నారు– అంటే ఆత్మ స్థితిలో ఉండటం అన్నమాట.

***యన్మూలం సర్వ భూతానాం యమ్మూలం చిత్తబంధనమ్ ।***
***మూలబంధః సదాసేవ్యో యోగోఽసౌ రాజయోగినామ్ ॥*** **114**

ఏ ఆత్మ సమస్త భూతాలకూ మూలమైనదో ఏ ఆత్మను ఆశ్రయించినందువల్ల చిత్తం స్థిరంగా ఉంటుందో అటువంటి భూతమూలమూ, చిత్త బంధము అయిన ఆత్మను ఎల్లప్పుడు సేవించటాన్నే మూలబంధము అంటారు. ఇదే రాజయోగుల యొక్క యోగం.

దీనినిబట్టి మనకు తెలుస్తున్నదేమిటీ అంటే, శారీరకమైన ఆసనాలను సాధించటం కోసం ప్రాకులాడటం కంటె తన సమస్తాన్నీ బ్రహ్మధ్యానంలో నిలిపి ఉంచితే అదే మనల్ని లక్ష్యాన్ని చేరుస్తుంది అని. మూలబంధమనే సమాసంలోని మూలము. బంధము అనే రెండు శబ్దాలను సమస్త భూతాలకు మూలమని, చిత్తాన్ని నిలకడగా ఉంచేదనే అర్థాలలో ప్రయోగించారు.

***అంగానాం సమతాం విద్యాత్సమే బ్రహ్మణి లీయతే ।***

***నో చేన్నైవ సమానత్వ మృజుత్వం శుష్క వృక్షవత్ ॥*** **115**

చిత్తం ఎప్పుడైతే సమ బ్రహ్మలో లీనమైపోతుందో అప్పుడే శరీరావయవాలు సమస్థితిలో ఉన్నాయని భావించాలి. కేవలం చచ్చి ఎండిపోయినట్టి చెట్టులాగా అవయవాలను నిశ్చలంగా ఉంచటాన్ని మాత్రమే దేహ సమత్వం అనటానికి వీలు లేదు. సమబ్రహ్మలో లీనమవటం అంటే బ్రహ్మ సమమైన– బ్రహ్మతో సమానమైన ఆత్మలో లీనమవటం అని భావం.

***దృష్టిం జ్ఞా మయీం కృత్వా పశ్యేద్బ్రహ్మ మయం జగత్ ।***

***సా దృష్టిః పరమోదారా న నాసాగ్రావలోకినీ ॥*** **116**

దృష్టిని జ్ఞానమయమైన దానినిగా చేసి ప్రపంచాన్నంతను బ్రహ్మమయంగా చూడాలి. దృష్టి అంటే అటువంటిదే దృష్టి. అటువంటి దృష్టినే నిజమైనట్టి, ఉత్కృష్టమైనట్టి నేత్రదృష్టి అన్నారు. అంతేగాని, కేవలం నాసాగ్రాన్ని – ముక్కు చివరిభాగాన్ని చూడటం మాత్రమే దృష్టి అనిపించుకోదు. సమస్తాన్ని బ్రహ్మమయంగా చూచేవాని దృష్టికి ఎక్కువ తక్కువలు ఉండవు – విశ్వవ్యాప్తమైన ఆ పరబ్రహ్మలోనే సమస్తము లీనమైపోయి ఉన్నందున! ఆ విధమైనట్టి దృష్టినే జ్ఞానమయమైన దృష్టి అన్నారు. కేవలం ముక్కు చివరిభాగాన్ని మాత్రమే తదేకంగా చూడటం వల్ల నేత్రపీడ తప్ప ప్రయోజనం లేదని భావం.

***ద్రష్టు దర్శన దృశ్యానాం విరామో యత్ర వా భవేత్ ।***

***దృష్టి స్తత్రైవ కర్తవ్యాన నాసాగ్రావలోకినీ ॥*** **117**

ఈ విషయానికున్న ప్రాధాన్యతను బట్టి ఈ దృష్టిస్థితినే ఇంకా వివరిస్తున్నారు. ఏ స్థితిలో - ఎక్కడైతే - ద్రష్ట (చూచేవాడు) దర్శనం (చూపు) దృశ్యం (చూడబడేది) అనే త్రిపుటి ఉండదో అటువంటి ఆ ప్రదేశాన్ని చూడాలి. అంతే తప్ప కేవలం నాసికాగ్రాన దృష్టి నిలపటం కాదు. జ్ఞాన స్వరూపమైన పరబ్రహ్మమందు పైన చెప్పిన త్రిపుటి ఉండదు. చూచేవాడు, చూడటం, చూడబడేది అనే భేదం ఉండదు. కాబట్టి దృష్టిని అక్కడ- పరబ్రహ్మమందు- నిలపాలి. పరబ్రహ్మలో ఏకీభావం చెందిన దృష్టి ఆవసరం అని భావం.

***చిత్తాది సర్వభావేషు బ్రహ్మత్వేనైవ భావనాత్ ।***

***నిరోధః సర్వవృత్తీనాం ప్రాణాయామ ః స ఉచ్యతే ।*** **118**

ప్రాణాయామాన్ని గురించి-

చిత్తం మొదలుగా గల సమస్త భావాలను బ్రహ్మ స్వరూపంగానే భావించటం వల్ల సమస్త వృత్తులు నిరోధింపబడతాయి. అదే ప్రాణాయామం అంటే । ప్రపంచాన్నే కాకుండా మన మానసిక ప్రవృత్తులన్నింటిని కూడా బ్రహ్మ స్వరూపంగానే భావించాలి. అంటే సమస్త భావాలను బ్రహ్మలో లీనం చేయాలి. ఆ విధంగా చిత్తవృత్తులన్నీ ఆత్మలీనం కావటమే ప్రాణాయామం అనిపించుకుంటుంది.

దీనినే ఇంకా విశదీకరిస్తున్నారు-

***నిషేధనం ప్రపంచస్య రేచకాఖ్యః సమీరణః ।***

***బ్రహ్మైనా స్మీతి యావృత్తిః పూరకో వాయురీరితః ॥*** **119**

ఈ ప్రపంచాన్ని నిషేధించటం- త్రోసివేయటమే- రేచకం అనే ప్రాణాయామం. 'నేనే బ్రహ్మను' అనే భావమే పూరకమనే ప్రాణాయామంగా చెప్పబడుతోంది.

ప్రాణాయామంలో రేచకం, పూరకం, కుంభకంఅనే మూడు ప్రక్రియలు యోగాభ్యాసం చేసేవారు పాటిస్తారు. రేచకము అంటే లోపల ఉన్న గాలిని బయటకు వదలటం కాకుండా,

పూరకం అంటే గాలిని లోనికి పీల్చటం. కుంభకం. అంటే, పీల్చినగాలిని లోపల నిలిపి ఉంచటం. ఇక్కడ కేవలం గాలిని బటయకు వదలటం కాకుండా ప్రపంచంతోడి సంబంధాన్ని మానసికంగా పూర్తిగా వదలివేయటాన్నే రేచకం అని అన్నారు. అట్లాగే 'నేనే బ్రహ్మను' అనే భావాన్ని దృఢంగా పొందటాన్నే పూరకం అని అన్నారు. ఈ విషయాన్ని గురించి పాతంజల యోగదర్శనంలో "తస్మిన్ సతి శ్వాస ప్రశ్వాసయోర్గతి విచ్ఛేదః ప్రాణాయామః" 'శ్వాస ప్రశ్వాసల గమనం (గాలిని పీల్చటం, వదలటం అనేవి) ఆగిపోవటమే ప్రాణాయామం' అన్నారు. (2పా. 49 సూ) ఇక్కడ ఆదిశంకరుల అభిప్రాయాంలో శ్వాస ప్రశ్వాసల నిరోధం కోసం ప్రయత్నించటం కంటె మానిసిక నిరోధం మంచిది. మనస్సు నిరోధింపబడితే ప్రాణాయామం సహజంగానే కలుగుతుంది అని.

***తత స్తద్వృత్తినైశ్చల్యం కుంభకః ప్రాణసంయమః ।***
***అయంచాపి ప్రబుద్ధానా మజ్ఞానాం ఘ్రాణపీడనమ్ ॥*** **120**

ఇక, పరబ్రహ్మ స్వరూపంలో నిశ్చలంగా ఉండటమే 'కుంభకం' అనే ప్రాణాఆయామం. జ్ఞానవంతులైనవారి పద్ధతి ఇదే! – మానసిక నిగ్రహం ద్వారా చేసే ప్రాణాయామమే సరియైనది. ఇక, అజ్ఞానులకు మాత్రమే ముక్కుకు బాధ కలిగించే ఆ విధమైన శరీరక ప్రాణాయామం. దీనినిబట్టి మనోనిగ్రహానికి ఎంతటి ప్రాధాన్యత నిచ్చారో తెలుస్తోంది.

***విషయే ష్వాత్మతాం దృష్ట్వా మనస శ్చితి మజ్జనమ్ ।***
***ప్రత్యాహారః స విజ్ఞేయోఽ భ్య స నీయో ముముక్షుభిః ॥*** **121**

ఈ ప్రపంచంలోని సమస్త వస్తువులందు ఆత్మభావాన్ని పొంది, మనస్సును ఆ పరమ చేతనలో ముంచివేయటమే ప్రత్యాహారం అని గ్రహించాలి. ముముక్షువులైనవారు ఆ విధంగా ఆభ్యాసం చేయాలి.

ఈ ప్రత్యాహారాన్ని గురించి పాతంజల యోగదర్శనం 2 పా. 54 సూత్రంలో ఇట్లా చెప్పారు. "స్వ విషయా సంప్రయోగే చిత్తస్వరూపానుకార ఇవేంద్రియాణాం ప్రత్యాహారః" "ఇంద్రియాలు తమ తమ బాహ్య వృత్తులనన్నింటిని అన్నివైపుల నుండి ప్రోగు చేసి– మరల్చి, చిత్తంలో విలీనం చేయటం కోసం (చిత్త స్వరూపంలో తదాకారాన్ని పొందటం కోసం) చేసే అభ్యాసాన్ని ప్రత్యాహారం అంటారు." అని. అంటే ఇంద్రియాలన్నీ తమ తమ

పనుల్ని వదలిచేసి, చిత్తంలో లీనమైపోవాలి. అయితే, ఆ విధంగా ఎప్పుడు జరుగుతుంది? చిత్తం ఆ పరమాత్మ యందు లగ్నమైనప్పుడు, ఆ చిత్తానికి అధీనమైన ఇంద్రియాలన్నీ తమ విషయాల్ని వదలివేస్తాయి– ఆ ఇంద్రియాలకు మనస్సు ఆదేశాలను ఇవ్వదు కాబట్టి.

***యత్ర యత్ర మనోయాతి, బ్రహ్మణస్తత్ర దర్శనాత్ ।***
***మనసో ధారణంచైవ ధారణా సా పరా మతా ॥*** **122**

ఇక ధారణను గూర్చి– మనసు ఎక్కడెక్కడికి వెడితే అక్కడక్కడల్లా బ్రహ్మసాక్షాత్కారాన్ని పొందుతూ మనస్సును స్థిరంగా ఉంచుకోవడమే ఉత్తమమైన ధారణ అని తెలుసుకోవాలి. ఈ ధారణనే పాతంజల యోగదర్శనంలో 3 పాదం 1 సూత్రంలో. ఇట్లా వివరించారు. “దేశ బన్ధ శ్చిత్తస్య దారణా” “శరీరం లోపలగాని, బయటగాని, ఎక్కడైనా సరే ఒకేచోట చిత్తం నిలిచి ఉండటాన్నే ధారణం అంటారు.” మనస్సు ఏ విషయం మీదకు పోయినా దానినల్లా బ్రహ్మగానే భావించాలి. అజ్ఞానంవల్ల ఏర్పరచుకొన్న నామరూపాలు త్యజించాలి. అప్పుడే సాధకుడు ‘ధారణ’ అనే స్థితికి చేరినట్లు భావించాలి.

***బ్రహ్మైవా స్మీతి సద్వృత్త్యా నిరాలంబతయా స్థితిః ।***
***ధ్యాన శబ్దేన విఖ్యాతా పరమానన్దదాయినీ ॥*** **123**

‘అహం బ్రహ్మాస్మి’– ‘నేనే బ్రహ్మను’ అనే ఈ విధమైన సద్వృత్తిలో– మంచి భావనతోగూడినట్టి, పరమానందాన్ని కలిగించే నిరాలంబస్థితిని (దేనిమీదా ఆధారపడకుండా ఉండే స్థితిని) ధ్యానమనే శబ్దంతో వ్యవహరిస్తారు. ఈ ధ్యానానికి ఉండవలసిన ప్రధాన లక్షణాలు రెండు (1) ‘నేనే బ్రహ్మను’ అనే భావం (2) నిరాలంబస్థితి.

ఈ ధ్యానమనే దానిని పతంజలి తమ యోగసూత్రాల లో ఇట్లా నిర్వచించారు. “తత్రప్రత్యయైకతానతా ధాన్యమ్” 3. పాదం 2. సూ. “చిత్తాన్ని నిలపవలసినచోట, ఒకే విధమైన ధ్యేయానికి సంబందించిన వృత్తి మాత్రమే (ధ్యేయానికి సంబంధించిన ఒకే భావం) ప్రవాహితమౌతూ ఉండటమే ధ్యానం” అని. అంటే, మధ్యలో ఇతర భావాలేవీ రాకూడదని, ఏకాగ్రత అవసరమని భావం. అంటే, అన్ని విధాలా తానే బ్రహ్మ అనే భావంతో బ్రహ్మలో తాదాత్మ్యం కావటం అన్నమాట.

*నిర్వికారతయా వృత్త్యా బ్రహ్మాకారతయా పునః ।*

*వృత్తి విస్మరణమ్ సమ్యక్ సమాధిర్ జ్ఞాన సంజ్ఞకః ॥* **124**

నిర్వికారంగా, బ్రహ్మాకార వృత్తితో, కూడినందున ఇతరమైన భావాలన్నింటిని మరిచపోవటం జరిగినపప్పుడు అటువంటి స్థితిని జ్ఞాన సమాధి అంటారు. నిర్వికారస్థితి ఉండాలి అంటే ఏ విధమైన చిత్తవికారాలూ ఉండకూడదు. బ్రహ్మాకారవృత్తి లో లీనమైపోవాలి అంటే తానే బ్రహ్మననే భావంతో లీనమూపోవాలి. ఇతర భావాలేవీ ఉండకూడదు. అదే జ్ఞాన సమాధి. ఇటువంటి స్థితిని స్పృహకోల్పోయిన స్థితిగా భావించరాదు. ఎందుచేతనంటే వృత్తిహీనమైన స్థితిలో కూడా శుద్ధచైతన్యం ఉండనే ఉంటుంది. చైతన్యాన్ని ఏ స్థితిలోను నిరాకరించలేము. కాబట్టి ఈ విధమైన సమాధినే జ్ఞానమన్నారు.

పతంజలి మహర్షి యోగదర్శనం 3 పాదం 3 సూత్రంలో సమాధిని ఇట్లా నిర్వచించారు– "త దేవార్థమాత్ర నిర్భాసం స్వరూపశూన్య మిన సమాధిః" అని. ధ్యానంలో కేవలం ధ్యేయం యొక్క ప్రతీతి మాత్రమే ఉంటూ, చిత్తం తన స్వరూపాన్ని తాను మరిచిపోయిన స్థితిని పొందితే ఆ విధమైన ధ్యానాన్ని సమాధి అంటారు అని.

*ఏవం చాకృతి మానన్దం తావత్సాధు సమభ్యసేత్ ।*

*వశ్యో యావత&క్ష ణాత్పుంసః ప్రయుక్తః సంభవే త్స్వయమ్ ॥* **125**

ఈ విధమైన స్వాభావికానందం, చిత్తం లగ్నమైన క్షణంలోనే ఆ ఆనందం తనకు వశమయ్యేస్థితి లభించేటంతవరకు బాగా అభ్యాసం చేయాలి. ఈ విధమైన ధ్యానం ఎంతకాలం వరకు ఆభ్యాసం చేయాలి? అనే ప్రశ్నకు సమాధానంగా ఈ శ్లోకం చెప్పారు. చిత్తం లగ్నమవటంతోడనే ఆ ఆనందం లభ్యమయ్యేంతవరకు ఆ ధ్యానం– సమాధిని అభ్యాసం చేయాలి. అని.

*తతః సాధన నిర్ముక్తః సిద్ధో భవతి యోగిరాట్ ।*

*తత్స్వరూపం న చైకస్య విషయో మనసో గిరామ్ ॥* **126**

ఇక అప్పుడు ఆ యోగిరాజు సమస్త సాధనములనుండి విముక్తుడౌతాడు. అతడిక అభ్యాసం చేయవలసిందేమీ ఉండదు. సిద్ధుడౌతాడు. ఇక సాధించాల్సింది ఏదీ ఉండదు.

ఆత్మ సాక్షాత్కారాన్ని పొందటం కోసం లోగడ చెప్పబడిన పదునైదు సాధనాలతో ఒక అతనికి పని ఉండదు. అతడు బ్రహ్మస్వరూపుడై పోయినందున. ఆ విధంగా స్వస్వరూపాన్ని (బ్రహ్మత్వాన్ని) పొందినట్టి ఆ యోగి, వాక్కుకు, మనస్సుకు అతీదుడౌతున్నాడు- పరబ్రహ్మలాగానే ! ఇదే విషయాన్ని, "స యోహవై తత్పరమం బ్రహ్మవేద బ్రహ్మైవభవతి" (ముం. ఉ. 3. ముం. 2. ఖం 9. మం.) ఆ పరబ్రహ్మను తెలుసుకొన్నవాడు పరబ్రహ్మయే అవుతాడు అని చెప్పబడింది. అట్లాగే, తై. ఉ. ఆ. వల్లి 2. నువాకంలో "యతోవాచోనివర్తన్తే అప్రాప్య మనసా సహ..." "మనస్సుతో పాటు వాక్కు కూడా ఎవనిని చేరలేక తిరిగి వచ్చేస్తున్నాయో..." అటువంటి పరమాత్మయే అవుతాడు ఆ సిద్ధుడు కూడా !

ఇంతవరకు అత్యుత్తమ స్థితిని గూర్చి, ఆ స్థితిని పొందటానికి ఉపకరించే సాధనాలను గూర్చి, ఆ స్థితిని పొందిన వానిని గూర్చి చెప్పారు. ఇక అటువంటి సాధనలో- సమాధి స్థితిని పొందటంలో సంభవించే విఘ్నాలను గూర్చి వివరిస్తున్నారు.

## సమాధిలో విఘ్నాలు

***సమాధౌ క్రియమాణే తు విఘ్నా ఆయాన్తి వై బలాత్ ॥***
***అనుసంధాన రాహిత్య మాలస్యం భోగలాలసమ్ ॥*** **127**

***లయ స్తమశ్చ విక్షేపో రసాస్వాదశ్చ శూన్యతా ।***
***ఏవం యద్విఘ్న బాహుల్యం త్యాజ్యం బ్రహ్మవిదా శనైః ॥*** **128**

సమాధిని అభ్యాసం చేసేటప్పుడు ఈ దిగువ చెప్పిన విఘ్నాల లాంటివి అనేకం వస్తాయి. అనుసంధానరాహిత్యం (విచారణ లేకపోవటం) ఆలస్యం (సోమరితనం, బద్ధకం) భోగలాలస (ఇంద్రియ భోగాల మీద కోరిక) లయము (నిద్ర) తమము (మందబుద్ధి, మత్తు) నిక్షేపం (కలవరపాటు) రసాస్వాదం (సుఖానుభవం) శూన్యత్వం (ఏమీ తోచని స్థితి) అంటే, కోరికల విషయంలో కలిగే ఘర్షణ వల్ల ఏమి చేయాలో తోచని స్థితి, బుద్ధి మాంద్యం మొదలైన అనేక విఘ్నాలు బలవత్తరంగా సంభవిస్తాయి. బ్రహ్మజ్ఞానాన్ని కోరేవాడు ఈ విఘ్నాలన్నింటిని మెల్లగా వదిలించుకోవాలి.

*భావ వృత్త్యాహి భావత్వం శూన్య వృత్త్యాహి శూన్యతా ।*
*పూర్ణ వృత్త్యాహి పూర్ణత్వం తథా పూర్ణత్వ మభ్యసేత్ ॥* **129**

సమాధి సమయంలో భావవృత్తి గనక ఉంటే భావత్వం లభిస్తుంది. అంటే ఒక వస్తువును గురించి ఆలోచిస్తే మనస్సు దానినే పొందుతుంది. అట్లాగే శూన్యవృత్తితో ఉంటే శూన్యత్వమే లభిస్తుంది. పూర్ణవృత్తిలో గనక ఉంటే– పరబ్రహ్మను గూర్చిన ఆలోచనలో ఉంటే పూర్ణత్వమే లభిస్తుంది. 'యద్ధ్యానం తద్భవతి' అన్నారు గదా । సమాధి సమయంలో పరమాత్మను గూర్చిన భావన చేస్తూ ఉంటే అప్పుడే అతడు పరిపూర్ణత్వాన్ని (బ్రహ్మత్వాన్ని) పొందుతాడు. దీనినే పూర్ణవృత్తి లేక బ్రాహ్మీ వృత్తి అంటారు.

## బ్రాహ్మీవృత్తి యొక్క మహత్త్వం

*యేహి వృత్తిం జహత్యేనాం బ్రహ్మాఖ్యాం పావనీం పరామ్ ।*
*వృథైవ తేతు జీవన్తి పశుభిశ్చ సమా నరా ః ॥* **130**

పరమ పవిత్రమైన ఈ బ్రాహ్మీవృత్తిని– బ్రహ్మభావాన్ని త్యజించి జీవించేవారు వ్యర్థంగా బ్రతుకుతున్నట్లే ! వారి జీవితం పశుజీవనం లాంటిది. ఆజ్ఞానాన్ని తరించి బ్రహ్మత్వాన్ని పొందేశక్తి మానవులకు మాత్రమే ఉంది. పశువులకు లేదు. ఆ ధ్యేయాన్ని పొందకుండా జీవించేవారు పశుతుల్యులు.

*యేహి వృత్తిం విజానన్తి యేజ్ఞాత్వా వర్ధయ న్త్యపి ।*
*తేవై సత్పురుషా ధన్యా వన్ద్యా స్తే భువనత్రయే ॥* **131**

ఈ బ్రహ్మవృత్తిని బాగా తెలుసుకొని, చిరకాలం అభ్యాసం చేసి సమాధిలో బ్రహ్మభావాన్ని పొంది, దానిని, పెంపొందించు కొనేవారే మహనీయులు. వారే సత్పరుషులు. వారే మూడు లోకాల్లోను ధన్యులు. నమస్కరింపదగినవారు.

*యేషాం వృత్తిః సమావృద్ధా పరిపక్వాచ సా పునః ।*
*తే వై సద్బ్రహ్మతాం ప్రాప్తా నేతరే శబ్దవాదినః ॥* **132**

ఈ విధమైన బ్రాహ్మీవృత్తి పెరిగి, పరిపక్వమైనవారే అత్యంత శ్రేష్ఠమైనట్టి, విశ్వవ్యాప్తమైనట్టి బ్రాహ్మీభావాన్ని పొం దుతారు. కేవలం వాగాడంబరంతో బ్రహ్మను గూర్చి చర్చించే వారికి అట్టి అత్యున్నత స్థితి లభించదు.

***కుశలా బ్రహ్మవార్తాయాం వృత్తిహీనాః సురాగిణః ।***

***తేప్యజ్ఞాని తమా నూనం పునరాయాన్తి యాన్తిచ ॥*** **133**

కొందరు బ్రహ్మ విషయకమైన మాటలు బాగా మాట్లాడుతారు– తెలివిగా వేదాంత చర్చలు చేస్తారు. ప్రవచనాలు బాగా చేస్తారు. కాని వారు బ్రాహ్మీవృత్తిలేనివారై ఉంటారు. రాగయుక్తులై. సాంసారిక వాసనలతో కూడినవారై ఉంటారు. అటువంటివారు నిజంగానే అజ్ఞానులు. వారు పుడుతూ చస్తూ ఉంటారు– అజ్ఞానం వల్ల !

***నిమేషార్థం న తిష్ఠన్తి వృత్తిం బ్రహ్మమయీం వినా ।***

***యథా తిష్ఠన్తి బ్రహ్మాద్యాః సనకాద్యాః శుకదయః ॥*** **134**

బ్రహ్మాది లోకపాలురవలె, సనకాది సిద్ధుల్లాగా, శుకదేవాది పరమ హంసలలాగా జ్ఞానులైనవారు ఒక్క అర్ధక్షణం కూడా బ్రహ్మమయ భావన లేకుండా ఉండరు. సర్వదా బ్రహ్మ భావంతో లీనమై ఉండటమే రాజయోగుల లక్ష్యం. ఇక్కడ జగద్గురువులు ప్రారంభ దశ నుండి ధ్యేయాన్ని పొందటానికి ధ్యానం అవసరమని అన్నారు. యోగదర్శన కారులైన పతంజలి శరీర నిగ్రహం, ప్రాణాయామం మొదలైన వాటిని ధ్యానానికి ముందుగా విధించారు.

కార్యకారణ సంబంధాన్ని, వృత్తి జ్ఞానానికి సాధనాలను గూర్చి చెపుతున్నారు.

# వృత్తి జ్ఞాన సాధనాలు

***కార్యే కారణతా యాతా కారణే వ హి కార్యతా ।***
***కారణత్వం తతో గచ్ఛేత్కార్యా భావే విచారతః ॥*** **135**

కార్యంలో కారణం అనుగతమై ఉంటుంది. కాని, కారణంలో కార్యం లనుగతమై ఉండదు. కాబట్టి ఆలోచించి చూస్తే, కార్యమనేది లేనప్పడు కారణం యొక్క కారణత్వం కూడా ఉండదు. కుండ అనేది కార్యం. ఆ కుండకు కారణ మైనది మట్టి, కారణమైన మట్టి కార్యం అయిన కుండలో ఎల్లప్పుడు అనుగతమై ఉంటుంది. అసలు కార్యం అయిన ఘటమే లేనప్పుడు మృత్తిక అనుగతమై ఉండటం అనేది సంభవించదు. అంటే కారణత్వమే ఉండదు. అంతేగాని, అసలు కారణమైన మృత్తికే ఉండదు అని భావింపరాదు. కార్యం ఉన్నంతవరకు ఈ రెండూ (కార్య కారణాలు) పరస్పర సంబంధం కలిగి ఉంటాయి.

***అథ శుద్ధం భవేద్వస్తు యద్వై వాచామగోచరమ్ ।***
***ద్రష్టవ్యం మృద్ఘటేనైవ దృష్టాన్తేన పునః పునః ॥*** **136**

ఈ విధంగా వాక్కుకు విషయం కానట్టి ఆ వస్తువు ఏదో (బ్రహ్మము) అదే (బ్రహ్మమే) శుద్ధమైనది. శాశ్వతమైనది అనే ఈ విషయాన్ని కుండ, మట్టి వీటిని దృష్టాంతంగా గ్రహించి మాటిమాటికి ఆలోచించాలి. ఈ విషయమే చాం. ఉ. 6 ఆ. 1 ఖం. 4. మంత్రంతో చెప్పారు. “యథాసోమ్యైకేన మృత్పిండేన సర్వం మృన్మయం విజ్ఞాతగ్ం స్యాద్వా చారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం”–ఆరుణి శ్వేతకేతువుతో– “నాయనా! ఒక మట్టి ముద్ద ద్వారా మట్టితో తయారయ్యే సమస్త వస్తువులకు సంబంధించిన జ్ఞానమూ కలుగుతుంది. ఈ వికారాలన్నీ– కుండ, బాన వగైరా పేర్లన్నీ మాటలతో వచ్చినవి మాత్రమే! మృత్తిక ఒక్కటే సత్యమైనది” అని చెప్పారు. ఈ దృష్టాంతం వల్ల నామరూపాత్మకమైన ఈ ప్రపంచం అంతా అసత్యమని, దీనికి కారణమైన బ్రహ్మమాత్రమే సత్యమని మాటి మాటికి భావన చేయాలి అని భావం.

***అనేనైన ప్రకారేణ వృత్తిర్బ్రహ్మాత్మికా భవేత్ ।***
***ఉదేతి శుద్ధ చిత్తానాం వృత్తి జ్ఞానం తతః పరమ్ ॥*** **137**

ఈ విధమైనట్టి ఎడతెగని ధ్యానం ద్వారా మాత్రమే వృత్తి బ్రహ్మాత్మకమౌతుంది. ఈ ధ్యానం ద్వారా బ్రహ్మ తప్ప ఇతరమేదీ లేదు అనే జ్ఞానం కలుగుతంది. అంతవరకు ద్వైతభావాన్ని కలిగించిన అజ్ఞానం మాయమౌతుంది. అప్పుడు మనస్సు కూడా అజ్ఞానాన్ని పారద్రోలి, సాధుకుని స్వస్వరూపానికి (బ్రహ్మ భావానికి) చేర్చి మాయమైపోతుంది. ఎట్లా? అగ్ని కట్టెను దహించివేసి చివరికి తాను కూడా చల్లారిపోయినట్లుగా ! అప్పడిక స్వప్రకాశంతో మిగిలేది పరబ్రహ్మ మాత్రమే !

***కారణం వ్యతిరేకేణ పుమానాదౌ విలోకయేత్ ।***

***అన్వయేన పునస్తద్ధి కార్యేనిత్యం ప్రపశ్యతి ॥*** **138**

పురుషుడు ముందుగా కార్యం నుండి కారణాన్ని వేరు చేసి చూడాలి. తరువాత సర్వదా ఆ కార్యంలో (ప్రపంచంలో) అనుగతమై ఉన్న రూపంలో చూస్తాడు. కారణం లేకపోతే కార్యం ఉండదు. కార్యం ఉన్న చోట కారణం ఉండి తీరాలి అనే ఈ రెండు పద్ధతుల్లో ఎట్లా చూచినా బ్రహ్మ ఉన్నాడని ఈ దృశ్యమానమైన ప్రపంచానికంతకు బ్రహ్మమే కారణమని తెలుస్తుంది– కారణాన్ని వేరు చేస్తే ఈ ప్రపంచ స్వరూపమే ఉండదు కాబట్టి, కారణమైన బ్రహ్మము ఉన్నందువల్లనే ప్రపంచం ఉంది. ఈ విధంగా ప్రపంచంలో సర్వదా అనుగతమై ఉన్న పరమాత్మను చూడాలి.

***కార్యేహి కారణం పశ్యేత్ పశ్చాత్కార్యం విసర్జయేత్ ।***

***కారణత్వం తతో నశ్యే దవశిష్టం భవే మ్మునిః ॥*** **139**

ముందుగా కార్యంలోనే కారణాన్ని చూడాలి– ప్రపంచంలోనే దానికి కారణమైన పరమాత్మను చూడాలి. తరువాత కార్యాన్ని (ప్రపంచాన్ని) వదిలివేయాలి. ఈ విధంగా చేయటం వల్ల కారణత్వం కూడా పోతుంది. కార్యం లేనప్పుడు కారణత్వం ఉండదు గదా! అప్పుడిక ఆ మునియైనవాడు కార్య– కారణత్వాలు లేని రూపమైపోతాడు. అంటే పరబ్రహ్మ స్వరూపమౌతాడు.

సారాంశం ఏమిటంటే– సాధకుడు ముందుగా ఈ ప్రపంచంలో కారణ రూపంలో ఉన్న పరమాత్మను దర్శించాలి. క్రమేణా ఈ ప్రపంచాన్ని త్యజిస్తూ పోవాలి. అట్లా సాధన చేయటం వల్ల కార్య కారణత్వాలూ రెండూ పోయి ఆ రెండూ లేని అవశిష్ట రూపం

మిగులుతుంది. అవశిష్ట రూపం ఆ మునే ! ఆ ముని యొక్క స్వస్వరూపమే మిగులుతుంది. అదే సత్యమైనట్టి ఆత్మ స్వరూపం.

*భావితం తీవ్ర వేగేన వస్తు యన్నిశ్చయాత్మనా ।*
*పూమాం స్తద్ధి భవేచ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమరకీటవత్ ॥* **140**

(కందురీగ ఒక పురుగును తీసికొనివచ్చి తన గూటిలో– రంధ్రంలో ఉంచుతుంది. ఆ పురుగు భయంతో తనకు శత్రువైనట్టి కందిరీగను గూర్చే నిరంతరం ధ్యానంచేస్తూ ఉంటుంది. అట్లా నిరంతరం కందిరీగను గురించే ఆలోచించడం వల్ల క్రమంగా ఆ పురుగు కందిరీగగా మారిపోతుంది. ఇది లోకంలోని విశ్వాసం– ఇది (భ్రమర కీట న్యాయం)

పురుషుడు ఏ వస్తువును గూర్చి నిరంతరం, నిశ్చయపూర్వకంగా తీవ్రవేగంతోచింతన చేస్తాడో ఆ వస్తువుగానే శీఘ్రంగా మారిపోతాడు అనే విషయాన్ని భ్రమర కీట న్యాయం ద్వారా తెలుసుకోవాలి. అంటే నిశ్చయాత్మక బుద్ధితో, శక్తినంతా వినియోగించి ధ్యానం చేస్తే ఉపాసకుడు ధ్యేయవస్తునే అవుతాడనేది ఉపాపనా విషయంలో చెప్పే విషయమే !

*అదృశ్యం భావరూపంచ సర్వమేతచ్చిదాత్మకమ్ ।*
*సావధాన తయా నిత్య స్వాత్మానం భావయేద్బుధః ॥* **141**

పండితుడైన పురుషుడు సమస్త జగత్తునూ అదృశ్యమైన భావ రూపం కలదిగా, చేతనమయమైనదిగా, గుర్తిస్తూ ఆ విధమైన జగత్తు తన ఆత్మ స్వరూపమే అని ఎల్లప్పుడు చింతన చేయాలి. ఈ జగత్తులో కనిపించేవి, కనిపించనవి, కేవల భావ రూపంలో ఉండేవి అయిన అనేక విషయాలు ఉన్నాయి. ఈ జగత్తు అంతటా దివ్యచేతన నిండి ఉంది. కాబట్టి బుద్ధిమంతుడు ఈ సమస్తాన్నీ శుద్ధచైతన్య స్వరూపం కలిగిన తన ఆత్మగానే గుర్తించాలి– అన్నిటియందు తన ఆత్మనే దర్శించాలి.

*దృశ్యం హ్యదృశ్యతాం నీత్వా బ్రహ్మాకారేణ చింతయేత్ ।*
*విద్వాన్నిత్య సుఖే తిష్ఠేద్ధియా చిద్రస పూర్ణయా ॥* **142**

బుద్ధిమంతుడైన సాధకుడు, దృశ్యాన్ని అదృశ్యంగా చేసుకొని (బ్రాహ్మ రూపానికి ప్రాధాన్యత ఇవ్వకుండా) దానినే పరబ్రహ్మగా భావించి చింతన చేయాలి. ఆ విధంగాచేస్తే

చిద్రసపూర్ణమైన బుద్ధి వల్ల నిత్యమైన ఆనందాన్ని పొందుతాడు. ముందుగా కనిపించే బాహ్యవస్తువుపై మనస్సును లగ్నం చేసి ధ్యానిస్తూ క్రమంగా ఆ బాహ్య వస్తువు యొక్క రూపాన్ని వదలి కేవలం ఆ భావాన్ని మాత్రమే ధ్యానిస్తూ క్రమంగా శుద్ధ చైతన్య స్వరూపమైన పరబ్రహ్మను పొందాలి. ఆ విధంగా పొందటం వల్ల తాను నిత్యానందాన్ని పొందగలుగుతాడు. తానే ఆనంద స్వరూపుడు అవుతాడు.

***ఏ భిరంగై : సమాయుక్తో రాజయోగ ఉదాహృతః ।***
***కించిత్ పక్వ కసాయాణాం హఠయోగేన సంయుతః ॥ 143***

ఈ పైన చెప్పబడిన 15 అంగాలతో కూడిన యోగాన్నే రాజయోగం అంటారు. ఎవని ప్రాపంచిక వాసనలు పూర్తిగా నశించలేదో (కొంతవరకు మాత్రమే విషయం వాసనాక్షయం అయినవారు) వారు ఈ చెప్పబడిన విషయాలను హఠయోగంతో జత చేసుకోవాలి. అంటే హఠయోగమనేది పూర్తిగా వాసనాక్షయం కాని వారి కోసం అని; రాజయోగ మనేది పూర్తిగా భావాత్మకమైనట్టిది కాబట్టి, మానసిక స్థితికి సంబంధిచినట్టిది కాబట్టి. వాసనలన్నీ క్షయమైపోయిన వారి కోసం ఉద్దేశింపబడ్డది. వాసనా క్షయం కాని వారు పరిపక్వత కోసం, ఈ హఠయోగాన్ని (శారీరకమైన నిగ్రహాన్ని) ఈ ధ్యానంతో జత చేయాలి. అట్లా చేస్తే మనస్సు వశమై, క్రమంగా వాసనలు క్షీణించి, రాజయోగానికి అర్హుడౌతాడు.

***పరిపక్వం మనో ఏషాం కేవలో యం చ సిద్ధిద ః ।***
***గురుదైవత భక్తానాం సర్వేషాం సులభో జవాత్ ॥ 144***

ఎవని చిత్తం పైన చెప్పిన విధంగా పరిపక్వమౌతుందో– వాసనాహీనమౌతుందో, అటువంటివానికి ఈ రాజయోగం సిద్ధిన కలిగిస్తుంది. ఈ విధమైన సిద్ధి కూడా గురుభక్తి, ఈశ్వరభక్తి కలవారికి ఇంకా శీఘ్రంగా, తేలికగా లభిస్తుంది. ఎందుచేత? గురుభక్తి, ఈశ్వరభక్తి ఈ రెండు ఉన్న వారికి సంశయాత్మక బుద్ధి ఉండదు కాబట్టి వారు తేలికగా ధ్యాన సమాధి స్థితిని పొందగలుగుతారు. అదే ఆత్మానుభూతి కలిగిస్తుంది.

ఇతి శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీ గోవింద భగవత్పూజ్య పాదశిష్య
శ్రీ మచ్ఛంకర భగవతా కృతా అపరోక్షానుభూతిః సమాప్తా.
ఓం తత్ సత్

**శ్రీ నోరి శ్రీనాథ వేంకట సోమయాజులు గారి గ్రంథములు**

1. ఉపనిషద్దర్శనము భాగం 1
   (తైత్తిరీయ, ఈశ, కేన, ప్రశ్న, మాండూక్య, కఠోపనిషత్తులు)
2. ఉపనిషద్దర్శనము భాగం 2 (బృహదారణ్యకోపనిషత్తు)
3. ఉపనిషద్దర్శనము భాగం 3(ఛాందోగ్య, ఐతరేయ, ముండకోపనిషత్తులు)
4. ఉపనిషద్దర్శనము భాగం 4
   (శ్వేతాశ్వతర, కైవల్యోపనిషత్తులు)
5. బ్రహ్మసూత్ర దర్శనము (శారీరక మీమాంస)
6. గీతా దర్శనము 9భగవద్గీత)
7. ఆత్మబోధ
8. ఆత్మానాత్మ వివేకము
9. అపరోక్షానుభూతి
10. వివేక చూడామణి
11. పతంజలి యోగదర్శనము
12. ధ్యానయోగము
13. వేదాంత పంచదశి (మాధవ విద్యారణ్య మునీంద్రకృతము)
14. యోగ వాసిష్టసారము
15. పరలోకము – పునర్జన్మ
16. మన వివాహ వ్యవస్థ

పై గ్రంథములన్నియు క్రింది వెబ్‌సైట్ నుంచి ఉచితంగా డైన్‌లోడ్ చేసుకోవచ్చును.

website : www.sriramakrishnatapovanam.org

Email : chvenkateswarlu30@gmail.com